







# వేదములు

సూత్ర+తాత్పర్య

# యజ్ఞోపవీత తత్త్వ దర్శనం



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4385 BETWEEN 10.30 AM AND 5.PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri
Telugu Tamil Sanskrit Kannada Hindi English
Online Subscription

Panchangam
Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam
Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham
Maha Bharatham Vol 1...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# యజ్ఞోపవీత తత్త్వదర్శనము

అవ్వారి శ్రీరామమూర్తిశాస్త్రి





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2006

# యజ్ఞోపవీత తత్త్వదర్శనము

రచయిత

అవ్వారి శ్రీరామమూర్తిశాస్త్రి




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2006

**YAJNOPAVEETA TATTVA DARSANAMU**

*by:*
**Avvari Sriramamurthya Sastri**



T.T.D. Religious Publications Series No : 583

TTD First Edition : 2000
Re-Prints : 2003, 2006

Copies : 5,000

Published by:
**Sri A.P.V.N. Sarma, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507

*Cover Design*
*P. Sivaprasad*

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

యజ్ఞ' మంటే భగవంతుణ్ణి పూజించటమని అర్థం. భగవంతుణ్ణి పూజించటంకన్నా పవిత్రమైన కార్యం మరొకటి లేదు. అందువల్లే 'యజ్ఞో వై విష్ణుః (యజ్ఞం విష్ణువుయొక్క స్వరూపమే) - అనే ఆర్యోక్తి అవతరించింది. అలాంటి అత్యుత్తమైన యజ్ఞకార్యాన్ని ఆచరించేందుకు అర్హమైన లక్షణంగా సృష్టికర్త ప్రసాదించిన ఉత్తరీయమే యజ్ఞోపవీతం.

తొలుదొల్త లేడిచర్మంతో తయారుచేయబడిన ఉత్తరీయాలను (యజ్ఞోపవీతాలను) బ్రహ్మచారులూ, వస్త్రంతో నిర్మింపబడిన ఉత్తరీయాలను (యజ్ఞోపవీతాలను) గృహస్థులూ ధరిస్తూ ఉండేవారు. కాలక్రమేణ, ఆ పవిత్రోత్తరీయాల స్థానంలో, సౌకర్యదృష్టితో సూత్రరూపమైన (దారంతో సమకూర్చబడిన) యజ్ఞోపవీతమే సర్వేసర్వత్ర వాడుకలో స్థిరపడింది. మానవులను పునీతుల్ని గావించే ఈ యజ్ఞోపవీతాన్ని శ్రేయోభిలాషులైన భారతీయులెల్లరూ ధరింపవలెనని 'ధర్మసింధువు' వంటి శాస్త్రగ్రంథాలు స్పష్టంగా ఆదేశిస్తూవున్నాయి.

''యజ్ఞోపవీత తత్త్వదర్శన'' మనే ఈ గ్రంథం, దేవపూజా విష్ణమై, పవిత్రోత్తరీయమై వెలసిన యజ్ఞోపవీతంయొక్క పుట్టు, పూర్వోత్తరాలను శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాది – ఆధారాలతో సరళమైన శైలిలో చక్కగా నిరూపిస్తూవుంది. అత్యపూర్వమైన ఈ గ్రంథం సుప్రసిద్ధ విద్వాంసులు, విజయవాడ వాస్తవ్యులు కీ॥శే॥ అవ్వారి శ్రీరామమూర్తిశాస్త్రి గారిచే గత శతాబ్ది పూర్వార్ధంలో రచింపబడింది.

ఆర్షసంస్కృతికి మూలకందమైన ఇలాంటి ముఖ్యాంశాలన్ను గూర్చి క్రోడీకరించి విమర్శనాత్మకంగా వివరించే గ్రంథాలు తెలుగులో మిగుల అరుదు. లోగడ ప్రచురించిన ప్రతులు చెల్లిపోయిన కారణంగా మళ్లీ పునర్ముద్రిస్తున్నాం. ఎప్పటిలాగే ఈ గ్రంథాన్ని జనావళి ఆదరిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ప్రస్తావన

ధర్మమే మానవజాతి యభ్యుదయ నిశ్శ్రేయసముల నందుటకు ప్రధాన సాధనము. అనాది నిధనముగు వేదవాఙ్మయ మా ధర్మ విజ్ఞానమున కాధారముగ నవతరించినది. కాని, వేదార్థ మతి గంభీరము. షడంగ సంబద్ధమయ్యు షడ్దర్శన సమన్వితమయ్యు నితిహాస పురాణ సంకలిత మయ్యు నయ్యది దురవగాహమే. దాని లోతుపాతుల నరసిన ధీరు లంగుళీగణనార్హులుగ మాత్రమే యుందురు. ఇది యిట్లుండ కాలక్రమమున మానవు లల్పాయుష్కులు, స్వల్ప మేధస్కులు గాఁజొచ్చిరి. వారి నుద్ధరించు తలంపుతో నేమి, మీమాంసకులు భావించినట్లు శాఖాన్తరాధ్యయన ప్రతి షేధాది కారణములచే నేమి మహానుభావులగు మన్వాపస్తంబాది మహ ర్షులు స్మృతులను కల్పసూత్రములను సమకూర్చిరి. బాదరాయణాదులచే పురాణములు ప్రణీతములైనవి. మాధవ కమలాకరాది మహావిద్వాంసు లచే నిబంధన గ్రంథములు నిర్మింపబడినవి. ఇంకను పలువురు పండిత ప్రకాండులు ధర్మతత్త్వ విశదీకరణార్థము దేశభాషలలో సైతము కొన్ని నిబంధనములను గ్రథించుచున్నారు. అట్టి తరగతికి జెందిన బ్రహ్మశ్రీ అవ్వారి శ్రీరామమూర్తిశాస్త్రి మహోదయ ప్రణీతమగు 'యజ్ఞోపవీత తత్త్వదర్శన' మను ప్రకృత కృతియును. ఏతత్కృతికర్తలు సుప్రసిద్ధులగు శ్రీకొప్పలగడ్డ రామకృష్ణశాస్త్రి, శ్రీ జయంతి భగీరథ శాస్త్రిపాదులకడ సాహిత్య వ్యాకరణ శాస్త్రములను సమగ్రముగ నభ్యసించిరి. పిదప చిరకాలము విజయవాడ శ్రీ దుర్గామల్లేశ్వర సన్నిధిని సంస్కృత పాఠశాలలో నధ్యాపకులుగ నుండి నేటి పలువురు పండితుల ప్రతిష్ఠకు నిదానభూతులైరి. ధర్మశాస్త్ర పరిశీలనమును వీరు చేయ మొదలిడినది నేటికి ముప్పది సంవత్సరములకు మున్నె యని వినికిడి. ప్రకృతకాలమున శిష్టాచారము పేరిట నంధపరంపరగ బ్రువ్ర్తములగుచున్న యవిమృష్టాచారము లనేకములు శ్రీశాస్త్రిగారిని కలవర పరుపఁజొచ్చినవి. అభ్యుదయ నిశ్శ్రేయసముల నభిలషించి చేయబడు కర్మ కలాప మిట్లు వికలమై యనర్థములకు దారి తీయుచుండుటను శాస్త్రిగారి ధార్మికహృదయము సహింపఁజాలక పోయినది. ధర్మానుష్ఠానములోని నేటి

లోటుపాటుల నెత్తిచూపుటతోపాటు పరిష్కృతమగు శాస్త్రీయపథమును పత్రికాముఖమునను, పండిత పరిషత్తులలోను వారు చాటి చెప్పసాగిరి. అట్టితరి కొందరు వీరి యుద్యమమును పొగడిరి, కొందఱు తెగడిరి, మరికొందరు లోలోన గుసగుస లాడఁదొడంగిరి. ఎవరేమనుకొన్నను శాస్త్రి గారు మాత్రము "న్యాయ్యా త్పథాత్ ప్రవిచలన్తి పదం న ధీరాః" అను భర్తృహరి వచనమును ఒరవడిగా మంచుకొని ముందడుగు విడసాగిరి. అందిది మొదటిది.

ఈ యజ్ఞోపవీతతత్త్వదర్శనగ్రంథ ప్రవృత్తివృత్త మతి విచిత్రము. నిత్యధర్మశాస్త్రపరిశీలనాభ్యాసము గల శ్రీశాస్త్రిగా రొకసారి యాపస్తంబ ధర్మసూత్రముల నవలోకించుచుండగా "నిత్య ముత్తరం వాసః కార్యమ్ - అపి వా సూత్రమేవోపవీతార్థే" — అను సూత్రములు గోచరించినవి. అంతకు మున్నే "యజ్ఞోపవీత్యేవాధీయీత యాజయే ద్యజేత వా యజ్ఞస్య ప్రస్సత్యై అజినం వాసో వా దక్షిణత ఉపవీయ దక్షిణం బాహు ముద్ధరతే సవ్యమితి యజ్ఞోపవీతమ్" అను తైత్తిరీయారణ్యకశ్రుతి స్మృతిపథమునకు వచ్చినపుడెల్ల తదర్థమును వారు భావించుచుండెడివారు. అదృష్ట విశేషమేమో కాని, రాను రాను వారి నా శ్రుతి స్మృతి ద్వయి అతిమాత్రముగ నాకర్షింప సాగినది. క్రమముగ వారి హృదయ ఫలకమున నది సమ్ముద్రితమై పోయి మహా ప్రభావమును ప్రసరింపఁజేసినది. ఇక నేమి! ఎన్నెన్నియో శ్రుతులను స్మృతులను పురాణములను వ్యాఖ్యానములను నిబంధనములను ప్రకృత శ్రుతి స్మృతి ద్వయార్థ నిర్ధారణార్థము వా రన్వేషింప మొదలిడిరి. సాధక బాధక ప్రమాణములను సమ్యగ్దృష్టితోఁ బరిశీలించి సమన్వయ పథమున నడిపించిరి.

నేటి కీ యపూర్వము, నత్యుత్తమము నగు గ్రంథరత్నమును బ్రక టించి, ధార్మికజన ధన్యవాదములకుఁ బాత్రులైరి. "సకల శ్రౌత స్మార్త కర్మాంగము, యజ్ఞోపవీతము; సంయోగ పృథక్త్వన్యాయమున నిత్యాది సదా ధార్యము గూడ నగుచున్నది. అజినోత్తరీయ వాసస్సు లద్దానికిఁ బ్రధాన సాధనములు. తదసంభవ పక్షమునఁ గర్మవైగుణ్య నివార ణమునకై ప్రతినిధిగ యజ్ఞసూత్రము విహిత మగుచున్నది. యజ్ఞ

సూత్రమున్నను కర్మానుష్ఠానకాలమున ముఖ్యములగు పలిన వాసస్సులు లభించునో, నవి యుపశ్యోపాదేయములు. ముఖ్యమును ధరించినపుడు గూడ సర్వ కర్మార్థముగ సంకల్పించి ధరించిన సూత్రమును తీసివేయరాదు. సూత్రములో నుపవీతియై యుండియు, నుత్తరీయమును నివీత ప్రాచీనావీత రూపముల నుంచికొని, యజన యాజనాదు లొనర్చుటయు, వస్త్రాజినము లతో నుపవీతియై యుండియు సూత్రమును మాత్రము నివీత ప్రాచీనావీత రూపముల నుంచికొని మల మూత్రోత్సర్గాదులఁ జరుపుటయును బ్రత్య వాయాపాదకము" ఇది యీ గ్రంథములోని ప్రధాన ప్రతిపాద్యాంశము. ఇకఁ బ్రసక్తానుప్రసక్తముగఁ బ్రతిపాదింపబడినవి మరెన్నియో యున్నవి.

"తావ త్త్వమత మప్రతిష్ఠితం భవతి, యావ త్పరమత మనిరాకృతమ్" అను న్యాయము ననుసరించి,'యజ్ఞసూత్ర ధారణకాల నిరూపణము, ఉత్తరీ యైకత్వ వ్యవస్థాపనము, నివీతోపవీత ప్రాచీనావీత కర్తవ్యనిర్ణయము' మున్నగు కొన్ని తావుల హరదత్త సుదర్శనాది ప్రఖ్యాత వ్యాఖ్యాతల మతములనుగూడ శాస్త్రిగారికి పరామర్శింపక తప్పినది గాదు. ఆ యా స్థలములలోని వారి యభిప్రాయ విశేషములు కొందరికి నచ్చకపోవచ్చును. అట్టివారు సవిమ ర్శముగ సముచితములగు తమ సమయాంతరములఁ బ్రకటింపవచ్చును. శాస్త్రిగారి యీ విమర్శన మందుకు పూర్వరంగ స్థానీయమే యైనను గూడ పూర్తిగా హర్షింపదగినదే యనుటకు సందియము లేదు.

ఎట్లైనను ధర్మతత్త్వమును వ్యక్తము గావింపవలయుననియే శాస్త్రిగారి యాశయముగాని, తాము పట్టిన పట్టె నెగ్గవలయునని మాత్రము కాదు. వారి యుపోద్ఘాతములోని "దోషా స్సన్తు గుణా స్సన్తు వివిచ్యాత్ర బుధా ముదా, ప్రదర్శయన్తు తాః సర్వాః ధర్మోద్ధారాయ దీక్షితాః" అను వచనమువలన వారి ధర్మనిరతియే గాక సహృదయత సైతము సువిదిత మగుచున్నది. పర్యవసానములో ఇట్టి పట్టుల "పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమి త్యవద్యమ్, సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః" అను సుభాషితమును భావించి వృథాభినివేశ వశీకృతులు గాక విజ్ఞు లిందలి యౌచిత్యానౌచిత్యముల విమర్శింపవలయునను విషయము మాత్రము విస్మరింపరానిది.

ధర్మ ప్రబోధకమును, విమర్శనాపూర్ణము నగు నిట్టి యుత్కృష్ట గ్రంథరాజమును ముద్రించి ధార్మికలోకమున కందజేయుటకు తోడ్పడిన విజయవాడ వైశ్యశిఖామణులు శ్రీ అలపాటి రామమూర్తి శ్రేష్ఠిగారి ధర్మాభిరతితో గూడిన యౌదార్యము ప్రశంసాపాత్రము.

శ్రీశాస్త్రిగారు ప్రవయస్కులయ్యు ధర్మశాస్త్ర పరిశీలనమున నిత్య తరుణులు వా వెగడుచుందురు. వర్తమానకాలమున సైతము వర్ణాశ్రమ చ్యుతి లేకుండ స్వధర్మానుష్ఠానముఁ జరుపుకొనుటకు సులభోపాయము లను వారు సూచించుచుందురు. మన దేశమున మరుగువడిపోయిన వైశ్వదేవ ద్వాదశాహ దీక్ష వీరి ప్రచార విశేషమువనే మరల తలయెత్తినది.

సంక్రమణ పుణ్యము, నాంది, ఉపాకర్మ, దత్తక ధర్మము -- మున్నగు విషయములపై వారు రచియించిన విమర్శనములు మరి కొన్ని యముద్రితములై యున్నవి. అవి యన్నియు సానవెట్టిన సముజ్జ్వల మహారత్నములు. సనాతన ధర్మపరాయణులగు భారతీయుల కవి సర్వథా సంగ్రాహ్యములు, శిరోధార్యములు. దాన వారు ధర్మశ్రీ విరాజితులు కాగలరు. "ధర్మో రక్షతి రక్షితః."

విజయవాడ
నందన - కార్తిక
కృష్ణాష్టమి.

సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి.

# అభిప్రాయములు

సర్వతన్త్ర స్వతన్త్ర యనదగు వ్యాకరణాచార్య బ్ర॥ శ్రీ కంభంపాటి రామమూర్తి శాస్త్రులవారిట్లు వ్రాయుచున్నారు.

బ్ర॥ శ్రీ అన్వారి శ్రీరామమూర్తి శాస్త్రిగారికి అనేక నమస్కారములు చేసి వ్రాయునది. కుశలోపరి.

తమరు పంపిన యజ్ఞోపవీత తత్త్వదర్శనమును ఆమూలాగ్రముగ చూచినాను. యుక్తిప్రమాణములతో పరిబృంహితమై యున్నది. గృహ్య సూత్రకారులయొక్క యభిప్రాయములు చక్కగా వివరింపబడినవి. ఏ విషయమైనను విమర్శనలో పెట్టినగాని దానియొక్క యాధిక్యము తెలి యబడదు. ఈ యజ్ఞోపవీత దర్శనమును ఆమూలాగ్రముగ పరికించి తమయొక్క పరిశ్రమను గురించి మిక్కిలి సంతోషించినాను. ఈ గ్రంథ మును చూచి యాస్తికవర్యులు యజ్ఞోపవీతముయొక్క తత్త్వమును గ్రహించి తరించుదురుగాక యని యాశించుచున్నాను.

ఇట్టి నిగూఢమైన యజ్ఞోపవీత తత్త్వమును సప్రమాణముగ సర్వజను లకు సుగ్రహముగునట్లు ప్రకటించిన తమకు పరమేశ్వరుడు ఇతోధికముగ నాయు రారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాక.

ఇతి శివమ్.

బందరు
కొజ్జిల్లిపేట,
25-9-52.

ఇట్లు మీ మిత్రుడు,
వ్యాకరణాచార్య,
(సం)కంభంపాటి రామమూర్తిశాస్త్రి.

విజయవాడ శ్రీరామ సాంగవేదపాఠశాలా ప్రధానాధ్యాపకులును, సాంగస్వా-ధ్యాయభాస్కర బిరుదాంకితులునునగు బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మణావధానులుగా రిట్లు వ్రాయుచున్నారు.

బ్ర.వే॥ శ్రీ అవ్వారి శ్రీరామమూర్తి శాస్త్రిగారిచే రచింపఁబడిన ఈ గ్రంథమునామూలాగ్రముగ జదివితిని. అతి గహనములగు శ్రుతి స్మృతి శ్రౌత గృహ్య సూత్ర గ్రంథములను తఱచి అమృతాయ మానములగు మహా ర్థముల నుద్ధరించి వీరు లోకమున కందించిరి. ప్రకృతము లోకమున శ్రుతి స్మృతి సూత్రాత్మకములగు మూలగ్రంథములను జూచువారలు సర్వాత్మనా మృగ్యులుగ నున్నారు. అట్టితరి వీరి గ్రంథప్రణయనోద్యమము సర్వవిధముల సమాదరణీయమును, ప్రశంసార్హమును నై యున్నది. కర్మానుష్ఠానకాలమున బ్రహ్మచారి, గృహస్థ లజినోత్తరీయ వాసస్సులను యజ్ఞోపవీతములుగ ధరింప వలయు నన్నది యిందలి పరమ సిద్ధాన్తము. ఈ యంశము నేటికిని శిష్టలోకమున నతివిరళ ప్రచారమై గోచరించుచున్నది. మూలగ్రన్థ పరిచితి కాలక్రమమున సన్నగిలుటచే కాబోలు కొంద రీ యంశమును పూర్తిగ విస్మరించుటయు తటస్థించుచున్నది. ఇది యిట్టి విశేషము కలదను విషయమును గుర్తింపకయే యాచరించువారును లేక పోలేదు.

కాని "యదేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" యను న్యాయము ననుసరించి జ్ఞానపూర్వకానుష్ఠానము ఫలాతిశయ సంపాదకము గావున నట్టి జ్ఞానవిశేష సంధాయకమగునట్లే ప్రధానాంశమును సాంగోపాం గముగ జర్చించి సవిమర్శముగ స్థిరీకరించుటయే ప్రకృతగ్రంథమున శ్రీ శాస్త్రిగారు కావించిన కార్యము. కాగా అభూతపూర్వము, నాచారదూరము నగు నేదో యొక క్రొత్త సిద్ధాంతమును సృష్టించినా రనుకొనుట కిచట తావు లేదు. ఇంతియే గాక, ఇతః పూర్వమే ఏతద్విషయక పరిజ్ఞానము గల పెద్దలకు తాదృశ జ్ఞాన దార్ఢ్య సంధాయకమయ్యు, ఇతరులకు నట్టి విజ్ఞాన జనక మయ్యు, నీ గ్రన్థరాజము సర్వాస్తిక లోకోపకారక మగుచున్నందున నేతత్ప్రణేత యగు శ్రీ శాస్త్రిగారికి ధార్మికలోక మెంతయు కృతజ్ఞతను చూపవలసి యున్నది.

ఇందు హరదత్త సుదర్శనాది మతములను కొన్నిచోట్ల శాస్త్రిగారు విమర్శించినారు. అయ్యది యకార్యమని తలంప వక్కఱ లేదు. హరదత్తాది మతముల ననేక స్థలములలో సుదర్శనాదులు విమర్శించి యుండలేదా? ఉక్తానుక్త దురుక్త చింతన మెట్టివారికిని విమర్శావసరమున తప్పనిసరి యగుచుండును.

ఏది యెట్లున్నను శాస్త్రసమ్మతమును, యుక్తి యుక్తమును నగు వచనము ఉపాదేయమగును గాని, యిందు వక్తృ విశేషవిచార మంతగ పాటింపఁ దగినదికాదు.

ఇట్లు,

విజయవాడ,
15-11-52.

సాంగస్వాధ్యాయభాస్కర,
(పం) కుప్పా లక్ష్మణావధానీ.

**బ్ర॥ శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు ఎం.ఏ.**
**లెక్చరర్, ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజి.**

ఉపనీతులకు యజ్ఞోపవీతము నియత ధార్యము. ఇతరులకు నైమిత్తికముగను, గౌణముగను గ్రాహ్యమగుచుండును. వేద విద్యా సంపత్తితోడనే జనించిన బ్రహ్మకు యజ్ఞోపవీతము సహజముగనే అనగా పుట్టుకతోడనే యున్నదని వేదములలో చెప్పబడినది. "ప్రజాపతే ర్యత్సహజమ్". వైదిక సంపత్తికిని యజ్ఞోపవీతమునకును నంత అవినాభావ సంబంధము. యజ్ఞోపవీతము వాసఃస్వరూపముతో నున్నపుడు నియతధార్యము కాదను భావము కలుగవచ్చునను ఊహతోనే సూత్రకారులు "నిత్య ముత్తరం వాసో ధార్యం" అని హెచ్చరించియున్నారు. దీనినిబట్టి యీ వాసస్సు అప్పుడప్పుడు పైకితీసి క్షాళనచేసికొనవలసినంత పెద్దది కాదనియు సూత్రమువంటిదే యనియు స్పష్టమగుచున్నది. "నజీర్ణ మలవ ద్వాసాః స్యాత్" అను సూత్రకార విధి కనుగుణమైనంత అల్పముగా నీ వాస స్సుండవలయును. సూత్రమునకును దీనికిని గల భేద మల్పము. అజిన వాసః కల్పముల సంపూర్ణ స్వరూపము నేడు మనకు తెలియుట లేదు. సూత్రకల్పమే నేటికి నిలిచి యున్నందున దానితత్త్వమే నేడు శిష్టులకు విదిత మగుచున్నది. యజ్ఞోపవీతోపనిషత్తు మున్నగు ననేక గ్రంథములలో సూత్రములయొక్కయు అవృత్తులయొక్కయు గ్రంథులయొక్కయు వాంతరార్థము బహువిధముల మర్లేఖింపబడినది. శ్రీ శాస్త్రిగారి యీ గ్రంథములోని భావములు జనసామాన్యములో ప్రాకుటకు పూర్వము పండితులలో చర్చింపబడవలయునని నా యభిప్రాయము. కావున పండితు లెల్లరు నీ గ్రంథమును శ్రద్ధగా పరిశీలింతురుగాక!

ఇట్లు,

4-11-1952 జటావల్లభుల పురుషోత్తము.

శ్రీరస్తు

# ఉపోద్ఘాతము

సర్వజీవకోటియు సుఖప్రాప్తిని దుఃఖనివృత్తిని గోరుచుండును. ఇందు నిత్యసుఖము మానుషజన్మైక ప్రాప్యమేగాని, ఇతర జీవసాధ్యము గాదు. సుఖమో దుఃఖమో జీవసహజధర్మమే గాన, దీనికి ప్రాప్తి నివృత్త్యుపాయములు లేవను బుద్ధి పనికి రాదు. లౌకికస్థితియందు సామాన్యముగ ప్రతిపూరుషుడును తన సుఖప్రాప్తికి దుఃఖనివృత్తికిని ఏదియో యుపాయ మున్నదనియు దాని నాశ్రయించిన నది తన కనుకూలించుననియు ఆశించి తత్కార్య కరణమున మగ్నుడగుచునేయుండి దానివలన కలుగు ఫల మనిత్యమైనను సంతుష్టిని పొందుచునే యుండును.

ఇట్టి విషయమున దుఃఖనివృత్తికి సుఖప్రాప్తికిని నియతమగు నుపాయ మేదియేని యుండుచో నయ్యది ప్రాణివర్గమున కత్యంతాభిప్రేతమును అవశ్యాన్వేషయము నగుటలో సందియ ముండదు గదా?

అట్టి యుపాయ మేమైయుండును? విచారించి చూడ ఆ యుపాయము ధర్మమని సుఖోత్పాదనమునకు బయలుదేరిన ఆయుర్వేదము సయితము —

శ్లో॥ సుఖార్థా స్సర్వభూతానాం మతా స్సర్వాః ప్రవృత్తయః,
సుఖం చ న వినా ధర్మా త్తస్మా ద్ధర్మపరో భవ.
-(అష్టాంగహృదయము).

సర్వజీవరాశి ప్రవర్తనము సుఖము కొఱకే అనియు, ధర్మము లేక సుఖము దొఱకదనియు చెప్పుచున్నది.

ఇట్టి ధర్మమును ప్రతిపాదించునది వేదమే యని-

శ్లో॥ ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే,
ఏతం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా.

అను విద్యారణ్యసూక్తివలన తెలియుచున్నది. అనగ ప్రత్యక్షానుమాన ప్రమాణములచేత తెలియని దానిని తెలియజేయునదియే వేదము — అని తాత్పర్యము.

ఇట్టి వేదము ప్రవృత్తి నివృత్తిరూప ద్వివిధ ధర్మబోధకతచే ప్రవృత్తి కాండము, నివృత్తికాండము — అను పేరులతో కాండద్వయాత్మకమై యున్నది.

అందు ప్రవృత్తి కాండము "కారీర్యా వృష్టికామో యజేత, చిత్రయా యజేత పశుకామః, ప్రాజాపత్యం ఘృతే చరుం నిర్వపే చ్ఛతకృష్ణలా మాయు ష్కామః, ఐన్ద్రాగ్నం చరుం నిర్వపే త్ప్రజాకామః" ఇత్యాది వాక్యములచే, ఆయుష్యము, సంతానము, ధనము, వర్షము మొదలగు కేవలైహిక ఫల ప్రదములగు నుత్తమ కర్మలనేగాక జ్యోతిష్టోమాది పారలౌకిక ఫలకములగు సంస్కారకర్మలను సైతము విధించుచున్నది.

ఇందుకు బోధాయనమహర్షి "గర్భాధానం పుంసవనం సీమన్తోన్నయనం జాతకర్మ నామకరణ మన్నప్రాశనం చూడాకర్మోపనయనం చత్వారి వేదవ్ర తానీ త్యేతే నియతా బ్రాహ్మ స్సంస్కారాః, పాకయజ్ఞాదయో దైవాః తే పున రుభయే బ్రాహ్మణ్యహేతవః."

గర్భాధానము మొదలు వేదవ్రతములవఱకు బ్రాహ్మ సంస్కారములు. పాకయజ్ఞములు, సోమయజ్ఞములు దైవ సంస్కారములు. ఈ బ్రాహ్మ, దైవ సంస్కారములు బ్రాహ్మణత్వమునకు హేతువులు — అని చెప్పుచున్నాడు. ఈ యర్థమునే మనువును

శ్లో॥ స్వాధ్యాయేన వ్రతై ర్హోమైః త్రైవిద్యే నేజ్యయా సుతైః,
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః.

— అని విపులీకరించి యున్నాడు.

నివృత్తికాండము సర్వసంగపరిత్యాగమును బోధించి అపరిక్షతమగు మోక్షరూప బ్రహ్మానంద సుఖము నిప్పించునట్టిది. ప్రవృత్తిధర్మము స్వర్గాద్యభ్యుదయమాత్ర ఫలకమేగాక నిష్కామమైనపుడు చిత్తశుద్ధి జ్ఞానప్రాప్తిద్వారా నిశ్శ్రేయసాత్మకమును నిరతిశయాఖండాత్మకమును నగు అపవర్గప్రదము గూడ నగుచున్నది. ఈవిషయమును "విహితత్వాచ్చాశ్రమ కర్మాపి." 3-४-3.౨ అను బ్రహ్మసూత్రము వ్యక్తముచేయుచున్నది. మఱియు.

త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన —

అను శ్రుతి ప్రసిద్ధమైనదే గదా!

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే

అను గీతావచనమును తెలియనివారు లేరుగదా!

ఇట్లు కాండద్వయాత్మకమగు వేదము ఉపేయమగు దుఃఖనివృత్తికిని సుఖావాప్తికిని పరమోపాయమైనది.

ఇట్టి వేదమును ప్రవర్తింపజేసినవారు మహర్షులు. ఆ మహర్షులలో ఆపస్తంబ బౌధాయన వైఖానస బోధాయనవిఖనోహిరణ్యకేశీయాదులు కల్పసూత్రకారులు, ధర్మసూత్రకారులును నై శ్రౌత స్మార్త నైతిక రూపమగు ప్రవృత్తిధర్మమును, బ్రహ్మ ప్రతిపాదకమగు నివృత్తిధర్మమును బ్రకాశింపజేసి వైదిక మతమునకు మహోపకృతి యొనర్చిరి.

అందు ప్రవృత్తి ధర్మము ప్రస్తుతమగుచున్నది. ఏతదర్థమైన ఆ యా సూత్రకార కృతములగు శ్రౌతస్మార్త నిబంధనము లతిగంభీరములైన నగుటవలన చిరస్మరణీయులగు మహావిద్వాంసు లనేకులు వానికి భాష్యము లొనర్చి వేదపురుషుని సేవించిరి. అయినను భిన్న భిన్న శాఖలవారు ఏకత్రావాసము గలవా రగుటచేతను పుందోషములవలనను మీమాంసితములు గాకపోవుటవలన తత్ప్రతిపాదిత వైదిక ధర్మములు సాంకర్యమును పొంది సరియగు నపూర్వమును బుట్టింపక రామ రామ విశ్వాసమాత్రముతో నెట్లో యాచరించబడుచున్నవే గాని, వారి వారి కల్పసూత్రానుసారము

ప్రవర్తించుట అరుదుగ గన్పట్టుచున్నది. ఇందుకు కాత్యాయన మహర్షి కొంచెముగగాని గొప్పగగాని తన గృహ్యశాఖయందు విధింపబడిన ధర్మమే తనకు శ్రేయస్సంపాదక మగునుగాని, పరశాఖోక్తధర్మ మట్టిదిగాదని ఈ క్రింది విధమున బోధించియున్నాడు.

శ్లో॥ యస్య యావ త్స్వగృహ్యోక్తం స్వల్పం వా యదివా బహు,
తస్య తావతి శాస్త్రార్థే కృతే సర్వం కృతం భవేత్,
న జాతు పరశాఖోక్తం బుధః కర్మ సమాచరేత్,
ఆచర న్పరశాఖోక్తం శాఖారండః ప్రకీర్తితః.

అని. కావున కల్పసూత్రానుసారము ప్రవర్తింపని వైదిక కర్మవలన లాభ మేమి? ఎవ్వరైన వారి వారి కల్పసూత్రానుసారము నిర్దుష్టమగు మార్గమును గుర్తించగలవారైనవారు తమచే నిర్వర్తితమగు ధర్మముచే నైహికాముష్మికఫల సాధనమగు నుత్తమమగు నపూర్వమును సంపాదించుకొనుటయేగాక "య ద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః" అను కృష్ణభగవానుని నుడి ననుస రించి తమ కల్పశాఖీయము నుద్ధరించ గలవారని నా తలంపు. నా తలంపున కేమి? ఆ యా శాఖీయులలోనుండు పండితులు వైదికధర్మోద్ధరణమునకు బద్ధకంకణులైననేగాని ఏతత్క్రియా నిర్వహణము కానేరదు.

ఎవ్వరు పండితులై యుండియు స్వశాఖా ప్రవిష్టములగు అన్యశాఖా చారముల దెలిసికొని స్వశాఖాచారముల నసంకీర్ణముగ నాచరించుకొనుట కశక్తులో, ఎవరు అలసులో అట్టి వారు తమ శాఖీయధర్మమున కుపకారులు గాకపోగా తమ యాచరణమువలన నపకారులుసైత మగుచున్నారని వేరుగ జెప్ప నక్కఱలేదు. కావున ఆ యా శాఖలయందలి పండితులు తమ తమ కుతర్కములతోనైన యన్యశాఖాసంక్రమణములనెడు దురాచారములను మాని, ప్రమాణపూరితములగు స్వశాఖీయాచారములను పరిపూర్ణమీమాంస లతో నిర్ణయించి ప్రవర్తింపజేయు బాధ్యతగలవారు గావలయును.

ఇట్టి ముఖ్యవిషయములను నాకు స్ఫురించునట్టి సాధక బాధక ప్రమా ణములతో సదయహృదయులగు పండితప్రకాండులముం దిడుటె విద్వద్విధే

యుడనగు నా కర్తవ్యము. తత్తన్నిర్ణయపూర్వక తత్తదనుష్ఠానానుష్ఠాపనములు పండిత ప్రకాండాయత్తములే యగుచున్నవి.

విమర్శింపబడినదై యాచరించబడిన వైదికధర్మము చైతన్యోపేతము గాగలదు. అట్టి ధర్మాచరణమువలన సిద్ధి ప్రత్యయము గలిగి అనుష్ఠాత తేజోవంతుడగును. లేనిచో నది లోకవిశ్వాసమును గోల్పోవగలదు. కోల్పోయి యున్నదనిగూడ జెప్పగలను.

కాని, ఇట్టి కార్యము కేవల పండితసాధ్యమే గాక, ధనవత్సహాయముతో గూడ నిర్వహింపబడదగినదియై యున్నది, ధనవంతులు ఉద్యోగులు అన్యవేష భాషలతో వైదిక మతమును గౌరవ విహీనమైనదానినిగ జేయుచున్నారు. కావున ధనవంతులు మతాభిమానము గలిగి పండితుల నాశ్రయించినవాడే మతమున కుజ్జ్వలత గలుగును. మతము నశించినపిమ్మట అధోగతి కంటె నన్యములేదు. కావున పండితులును ధనవంతులును నీ వైదిక ధర్మోద్ధరణమునకు బూనుకొనవలసినవారై యున్నారు. అట్లు జరిగిన యెడల వైదికధర్మము తన యథార్థరూపముతో తాండవించుననుటకు సందియ ముండదు. విమర్శింపబడినచో వైదిక ధర్మము సుఖానుష్ఠేయము, సంతోషావహము నగుచున్నది.

బ్రాహ్మణత్వ మనునది వైదిక ధర్మానుష్ఠానము నాశ్రయించి యున్నది. యథావ ద్వైదిక ధర్మానుష్ఠానము లేని బ్రాహ్మణుడు నామమాత్ర బ్రాహ్మణుడు. ఇందువలన నాకు పౌరాణికాగమాచారములయందుకంటె వైదికాచారములయం దెక్కుడు భక్తిగలదు. ఆ కారణమున నేను ధర్మాన్వేషణ మొనరించి యొక్కొక్క విషయమును విమర్శించి ప్రకటించ వలయునను కోరికతో ముందుగా సర్వధర్మమూలభూతమగు యజ్ఞోపవీతముయొక్క ఆమూలాగ్ర విమర్శకు బూనుకొంటిని. "యజ్ఞోపవీతినా ఉ_ఉ_చాన్తేదకేన చ కృత్యమ్." (గో. ౧-౧-౨) యజ్ఞోపవీతియై యాచమించినవానిచే వైదికకర్మ ప్రవర్తించును. ఇట్టి దీనియందు స్మృతిభేదములను వ్యాఖ్యాతృ దోషములను నానా శాఖీయాచారములను శ్రుతిసిద్ధాన్తమును యజ్ఞోపవీత విషయమున పరిగ్రాహ్యములును పరిత్యాజ్యములునగు అనేకాంశములను దెలిపికొనగలరు.

గ్రంథవిస్తర భీతిచే సంగ్రహింపబడిన ఔశనస భారద్వాజాది స్మృతులందరి విస్తరము నా యీ స్మృతులయందు జూడగలరు.

ఈ గ్రంథమున నుత్తరీయమే యజ్ఞోపవీతమనియు నది సర్వభారతీయులకు వైదికకర్మ సాధనమేగాక, అతిప్రియముగ ప్రతివ్యక్తియు సర్వదా ధరించదగిన మంగళకరమగు మహోత్తమ చిహ్నమనియు దాని ధర్మమును నిర్వహించునదియే జందెమనియు శ్రుతి స్మృతి పురాణ ప్రమాణములతో దెలియజేసెదను.

నే నిదివఱలో ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము 'స్వధర్మప్రకాశిని' 'బ్రాహ్మణ' పత్రికలలోను తరువాత 'కల్పవల్లి' పత్రికలోను ఈ నా వాదమును ఖండ ఖండములుగ ప్రకటించియుంటిని. ఇపుడు గ్రంథరూపమున ప్రకటించుచున్నాను. నేను జేయు వాదము శ్రుతి స్మృతి మూలమేయైనను విస్మృత భావము గలదగుటవలన ప్రేక్షకులకు శ్రోతలకు క్రొత్తదిగను విభ్రాన్తిజనకముగ గూడ నుండవచ్చును. కాని, శాంతదృష్టితో పరిశీలించిన నిందలి వాస్తవము గోచరించును.

నా కీ గ్రంథరచనకొఱకైన బహుగ్రంథాన్వేషణములో శ్రీ బృహదారణ్యక శాంకరభాష్యము నయనపథ మలంకరించినది. అపుడు దానిలోని ఈ గ్రంథ సందర్భమును సిద్ధాన్తముచేయు శ్రుత్యుదాహరణములు ప్రత్యక్షమగుటతోడనే శ్రీభగవత్పాదుల వైదికమత ప్రతిష్ఠాపకతకు లోకమెంతయు అధమర్ణమైన(అప్పుపడిన)దే గదా! యని కొంతసేపు శరీరమును మఱచి, పిమ్మట భగవత్పాదుల కనేక వందనము లాచరించి —

శ్లో॥ విమత విరాస విదగ్ధా శ్రుతిముఖ వివిధ ప్రమాణ శతసిద్ధా,
శుద్ధా శంకరబద్ధా జయతి కృతి ర్ముక్తిదాన సంవద్ధా.

— అను విద్వత్కంఠీరవులగు నరకంఠీరవ పండితుల కంఠరవము నకుంఠముగ ముక్తకంఠముతో సంగీత మొనర్చితిని.

మఱియొకమనవి!

సంస్కృతము రానివారికి ప్రథమ ప్రకరణము సుబోధముగ నుండదను తలంపుతో సంగ్రహించబడినది. అట్టివారు సంగ్రహము జదివి ప్రకరణమును జదువుకొనిన సుబోధమగును. ద్వితీయప్రకరణము సంస్కృత భాగము వదలిగాని వదలకగాని చదివిన సుబోధముగనే యుండును. కావున చదువరుల నట్లు జేయ ప్రార్థించుచున్నాను.

నాకు శారీరకముగను మానసికముగను ఆర్థికముగను నుండు కష్టములు బహుళములైనప్పటికి ఈనాటికైన దీనిని వైదికోత్తముల కరకమలముల సమర్పింప ననుగ్రహించిన వేదపురుషున కనేక సాష్టాంగ ప్రణిపాతముల నర్పించుచున్నాను.

ఇకనైన ఆ పరమేశ్వరుని యనుగ్రహమున్న ఆచమనవిధి, నాందీ ముఖము, సంక్రమణ పుణ్యము, దత్తక శాస్త్రము, ఉపాకర్మ కృత్యమును సంపూర్ణ విమర్శతో నీ వ్యక్తివలన వెలువడగలవు.

ఈ గ్రంథమందలి అనేకోద్గ్రంథోదాహరణముల పరిశీలనమున నాకు మిక్కిలి ఆదరముతో దోడ్పడిన మీమాంసా విద్యాప్రవీణ బిరుదాంకితులును, వేదార్థవిశారదులును నగు బ్ర॥ శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తిగారి కెంతయు కృతజ్ఞుడను.

ఈ గ్రంథరచనమున కామోదించి ప్రకటింప నుత్సాహపఱచిన పండిత మండలికి కృతజ్ఞతాపూర్వకాభివందనముల నర్పించుచున్నాడను.

విజయవాడ వాస్తవ్యులు శ్రీఆలపాటి రామమూర్తిశ్రేష్ఠిగారు శ్రీ ఖర నామ సం॥రవైశాఖ శు॥ (ది. 12-5-51) శనివారము తన కుమారుడు చిరంజీవి మోహనరావుగుప్త యుపనయన సమయమున నీ గ్రంథ ప్రాశస్త్యమును దెలిసికొని అత్యంత భక్త్యుత్సాహములతో దీనిని ముద్రింపించ సంకల్పించి సబహుమానముగ నన్ను బూజించి ధర్మప్రచారదృష్టితో దీనిని ముద్రింపించి లోకమున కందజేసినందుకు ఆయు రారోగ్యైశ్వర్యాభివృద్ధితో ఆయనగారి కుటుంబమును వృద్ధిపొందించ పరమేశ్వరుని వేవిధముల బ్రార్థించుచున్నాను.

శ్లో॥ దోషా స్సన్తు గుణా స్సన్తు వివిచ్యాత్ర బుధా ముదా,
ప్రదర్శయన్తు తాన్ సర్వా న్ధర్మోద్ధారాయ దీక్షితాః.

రామరాజనగరము, ఇట్లు, విద్వజ్జన విధేయుడు,
విజయవాడ, అవ్వారి శ్రీరామమూర్తిశాస్త్రి,
1-8-52 గ్రంథకర్త.

## యజ్ఞోపవీత తత్త్వదర్శనము

# విషయసూచిక

శ్రీరస్తు

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# యజ్ఞోపవీత తత్త్వదర్శనము

## దైవ ప్రార్థనము

శ్లో॥ విఘ్నేశం విఘ్ననాశాయ వాణీం వాచాం వివృద్ధయే,
సదాశివం జ్ఞానసిద్ధ్యై సందధేఽహం సదా హృది. ౧

శ్లో॥ శ్రుతి ధర్మ నిగూఢార్థ ప్రకాశక సుధీమణీన్,
ఆపస్తమ్బముఖాన్ కల్పకారా న్నౌమి నిరన్తరమ్. ౨

శ్లో॥ యశస్వినౌ గురూ వన్దే రామకృష్ణ భగీరథౌ,
యాభ్యా మధ్యాపిత శ్చాహం సాహితీం వ్యాకృతిం శివామ్. 3

శ్లో॥ సన్తత వివిధ క్రతుసన్తానార్చిత దేవ భూమిదేవం తమ్,
అన్వార్యన్వయకర మానౌమి శ్రీ సోచనాఖ్యయజ్వానమ్. ४

శ్లో॥ శ్రీకృష్ణవేణీవ పవిత్రమూర్తిం
తన్నామధన్యాం జననీం ప్రణమ్య,
శ్రీ వేంకటప్పార్యగురుం బుధాగ్ర్యం
శ్రీమద్భరద్వాజ కులం స్మరామి. ౫

శ్లో॥ చత్వారః ప్రబభూవు రార్యవినతాః పుత్రా స్తయో శ్శ్రీమతో
స్తేషా మగ్రభవః ప్రపన్నగిరిశ శ్శ్రీరామమూర్తి స్సుధీః,
శ్రీమద్వైదికభూసురాజ్ఘ్రిషు సదా భక్తః కరో మ్యాదరా
ద్ధీరాః! పశ్యత తత్త్వదర్శన మిదం యజ్ఞోపవీతస్య మే. ౬

శ్రీ

# గ్రంథారంభ ప్రయోజనము

పరమ పవిత్రమగు వైదిక ధర్మానుష్ఠానమున కత్యంతా వశ్యకము లైన సాధనములలో యజ్ఞోపవీత ముత్తమాంగతను పొందియు విశేషించి పురుషార్థసంపాదకమై సర్వధర్మమూలమై ద్విజ మహాలక్షణమై యున్నం దున "య దేవ విద్యయా కరోతి తదేవ వీర్యవత్తరం భవతి" అను శ్రుత్యాదేశమున శ్రుతి స్మృత్యన్వేషణ మొనరించి దాని తత్త్వమును దర్శించి దానిని ధరించి అట్టి ధారణవలన గలుగు సుకృత రూపాఽపూ ర్వమును బొందుట వైదికమతావలంబుల కావశ్యక ధర్మములలో నొకటి యగుచున్నదను తలంపుతో ధర్మజిజ్ఞాసా ప్రాధాన్యమున చిరకాల పరిశ్రమచే బహుతర శ్రుతి స్మృతి సదాచారముల నన్వేషించి యజ్ఞోపవీత తత్త్వమును దర్శించి యజ్ఞోపవీత తత్త్వదర్శన మను పేరుతో నీ సంక్షిప్త గ్రంథరచన ముపక్రమించుచున్నాడను.

* * *

శ్రీః

**ఓమ్ అథ.**

## ప్రథమప్రకరణము

# యజ్ఞోపవీత శబ్దార్థము

1 ఉపవీయతే వామస్కంధోఽనేనేతి ఉపవీతమ్. వ్యేఞ్ సంవరణే, బాహులకాత్ సాధనే క్తః.

— *(అమరకోశ లింగాభట్టీయ వ్యాఖ్యానము).*

దీనిచే నెడమభుజము కప్పబడుచున్నదిగాన నుపవీతము.

2 ఉపవీయతే స్మ (ద్విజేన) ఉపవీతమ్. వ్యాదేశే అజధాతోః కర్మణి, వీ ధాతోః కర్మణి కర్తరి వాక్తః.
ద్విజునిచే పొందబడుచున్నదిగాన ఉపవీతము.

3 ఉపాజతి స్మ వా ఉపవేతి స్మ వా
ద్విజుని పొందుచున్నది గాన ఉపవీతము.

4 యజ్ఞస్య యజ్ఞార్థం వా ధృతం సూత్రమ్ యజ్ఞసూత్రమ్.

— *(అమరకోశ సుధావ్యాఖ్యానము).*

యజ్ఞసంబంధమగు సూత్రము లేక యజ్ఞముకొఱకైన సూత్రము యజ్ఞసూత్రము.

5 యజ్ఞార్థ ముపవీతం యజ్ఞోపవీతమ్.

— *(ఆప॥ శ్రౌతసూత్రభాష్యము. గోభిల భాష్యము).*

యజ్ఞముకొఱకైన యుపవీతము యజ్ఞోపవీతము.

6 యజ్ఞే ధృతం సూత్రం ఉపవీతం వా యజ్ఞసూత్రం యజ్ఞోపవీతమ్.

— *(శబ్దకల్పద్రుమము).*

యజ్ఞమందు ధరింపబడిన సూత్రముగాని ఉపవీతముగాని యజ్ఞసూత్రము లేక యజ్ఞోపవీతము.

7 యజ్ఞేన సంస్కృత ముపవీతం యజ్ఞోపవీతమ్. ఉపనయన సంస్కారేణ పవిత్రీకృతే త్రివృతి వామస్కంధా ద్దక్షిణ కుక్షితః లమ్బమానతయా ధృతే సూత్రభేదే.

— (*తారానాథతర్కవాచస్పతి కృత వాచస్పత్యభిధానము*).

ఉపనయన సంస్కారముచే పవిత్రము జేయబడి మూడు పేటలు గలిగి పైకి పేనబడి ఎడమభుజమునుండి దక్షిణ కుక్షి వైపునకు వ్రేలాడునట్లుగా ధరింపబడిన సూత్రవిశేషము.

8 యజ్ఞే నోపవీతః యజ్ఞోపవీతః. "యజ - దేవపూజా సంగతి కరణ దానేషు". యజ - యాచేతి నఙ్ ప్రత్యయః యజనం యజ్ఞః ఉపోపసర్గః వీ గతి వ్యాప్తి ప్రజన కాన్త్యశన ఖాదనేషు క్తప్రత్యయః.

— (*పండితరాజ వేణీమాధవశాస్త్రి కృత శిఖా యజ్ఞోపవీత మీమాంస*).

యజ్ఞముచే వ్యాపింపబడినది గాన యజ్ఞోపవీతము.

9 యజ్ఞోపవీతంనామ వేదవిహిత కర్మాధికార సూచకాఙ్కమస్తి.

—(*యమునాశంకర దేవశంకరశాస్త్రి, సంస్కృత సాప్తాహికము*)

(*27-8-1946* ).

యజ్ఞోపవీత మనునది వేదవిహిత కర్మాధికారమును సూచించు గుఱుతు.

10 శ్లో॥ యజ్ఞార్థం ధార్యతే సూత్రం యజ్ఞం బ్రహ్మణ్య మిష్యతే.

యజ్ఞముకొఱకు ధరింపబడు సూత్రము. యజ్ఞమన నీశ్వరప్రీతికరమగు కర్మ.

11 శ్లో॥ యజ్ఞాఖ్యః పరమాత్మాయ ఉచ్యతే చైవ హోతృభిః,
ఉపవీతం తతోస్యేదం తస్మాద్యజ్ఞోపవీతకమ్.

— (*సంస్కారరత్నమాలయందు స్మృతిసారము*).

ఋత్విక్కులు పరమేశ్వరుని యజ్ఞరూపునిగ జెప్పుచున్నారు. తత్సంబంధమైన ఉపవీతముగాన యజ్ఞోపవీతము.

12 శ్లో॥ జ్ఞానాత్మ కేన హరిణా బ్రహ్మాత్మని శివేఽవ్యయే,
తత్సూత్ర ముపవీతత్వాత్ బ్రహ్మసూత్రమితి స్మృతమ్.

జ్ఞానాత్మకుడైన హరిచే బ్రహ్మస్వరూపుడగు శివునకు విన్యాసవిశేషముగ జుట్టబడినది గాన బ్రహ్మసూత్రము.

13 శ్లో॥ యజ్ఞేన చోపవీతత్వా ద్యజ్ఞసూత్రం విదు ర్బుధాః,
యజ్ఞ (విష్ణు)మూర్తిచే నట్లే ధరింపబడినదిగాన యజ్ఞసూత్రము.

14 శ్లో॥ తదాజ్ఞయా వృతత్వాచ్చ బ్రహ్మణా బ్రహ్మసూత్రకమ్.

— *(సంస్కార రత్నమాలయందు స్మృతిప్రకాశము).*

విష్ణుదేవునియాజ్ఞచే దేవునిచే విన్యాసవిశేషముగ ధరింపబడినదిగాన బ్రహ్మసూత్రము.

15 శ్లో॥ పద్మాసనస్థేన పితామహేన వినిర్మితం పంకజనాలసూత్రాత్.

— *(సంస్కారరత్నమాలయందు స్మృతిసారము).*

పద్మాసనస్థుడైన బ్రహ్మ తామరతూటి దారమున యజ్ఞసూత్రమును నిర్మించెను గాన బ్రహ్మసూత్రము.

16 వేఞ్ = తన్తుసన్తానే

(వేయుట) అను ధాతువునుండి పుట్టినదని లోకమాన్య బాళగంగాధర తిలక్ (మృగశీర్ష).

ఈ పదునాఱు వ్యుత్పత్తులందును లోకమాన్యుడు తన యొక్క మహామేధచేతను ధీరత్వముచేతను యజ్ఞోపవీతము వస్త్రమే యను పరమ సిద్ధాన్తము గలవాడగుట సమంజసమే యైనను, ఉపవీతశబ్దము వేఞ్ ధాతువునుండి నిష్పన్నమైనదనుటమాత్ర మసమంజస మనక తప్పదు. ఎందువల్లనన ఆ ధాతువు సంప్రసారణప్రాప్తి గలదగుటచే దానినుండి 'ఉపవీతం' అని గాక, 'ఉపోతం' అను అనిష్టరూప మేర్పడగలదనువిషయము విజ్ఞవిదితము.

ఈయన వ్యాఖ్యానమును మఱియొకచోట (పు.94) జూడుడు. అమరకోశ వ్యాఖ్యాత యగు లిఙ్గాభట్టుచే 'వ్యేఞ్' ధాతువు నుండి చేయబడిన

నిర్వచనము యుక్తిసహమేగాక వక్ష్యమాణ శ్రుత్యుపపాదితముగూడ గాన నత్యన్త సమంజసము.

మఱియు నుపవీతశబ్దమున కీ క్రింది విధమునగూడ వ్యుత్పత్తులను జెప్పవచ్చును.

1 ఉపవీయతే (పురుషేణ) ఉపవీతమ్. వ్యేఞ్ సంవరణే కర్మణి క్తః. పురుషునిచే విన్యాసవిశేషముగా ధరింపబడునది.

2 ఉపవీయతే ఉపవీతమ్. సాధ్యసాధనయో రభేదోపచారాత్ ఉపవీతసాధనద్రవ్యే ఉపవీతశబ్దప్రవృత్తిః. వ్యేఞ్ భావే క్తః. కప్పునది ఉపవీతము.

3 ఉపవీతం అస్యాస్తీ త్యుపవీతమ్. అర్శ ఆద్యచ్. ఉపవీతక్రియ గలది గాన ఉపవీతము.

విశేష మేమన? నుపవీతమునకు కాదాచిత్కములగు నివీత ప్రావీనావీతములు సంభవించుచున్నప్పటికిని యోగరూఢిచేతను ఉపవీతములో జేయదగిన దేవకార్య బాహుళ్యముచేతను మల్లగ్రామము, పండితగ్రామము (ఎక్కువమంది మల్లులు గల్గి ఇతరులున్ను గల గ్రామము మల్లగ్రామము, ఎక్కువమంది పండితులు గల్గి ఇతరులున్ను గల గ్రామము పండితగ్రామము) అనునట్లు ఉపవీతమను వ్యవహారమున భంగము లేదు.

మఱియు బోధాయన పరిభాషయందు ౧౧ సూత్రములు యజ్ఞోపవీత శబ్దార్థమును నిర్వచించుచున్నవి. అందు మొదటి మూడింటికి మాత్రము అర్థమును వివరించుచున్నాను.

1 క థ ముపవీతం ఖ లు యజ్ఞోపవీతమితి విజానీయాత్ (౨-౨-౧౩)

తా॥ యజ్ఞోపవీత శబ్దము యౌగికముగా ఉపవీతమందెట్లు వర్తించును?

2 "త దేతద్దక్షిణస్య హస్త స్యాథస్తా ద్భవతి. యోఽయం దక్షిణో హస్తస్స యజ్ఞ ఇతి. యజ ఇత్యయం శబ్దో దేవ పూజా సంగతి కరణ దానేషు. యస్మా దేతాని కుర్వతే తస్మా ద్యజ్ఞః." (౨-౨-౧౪).

తా॥ దేవపూజా సంగతి కరణ దానార్థకమగు యజధాతువువలన యజ్ఞశబ్ద మేర్పడుచున్నది. దక్షిణహస్తము(కుడిచేయి) దేవపూజాదుల కుప

యుక్తమగునుగాన యజ్ఞ మనబడును. ఆ కుడిచేతిక్రిందుగ వ్రేలాడునది గాన యజ్ఞోపవీతమని చెప్పబడుచున్నది.

3 "వా గ్యజ్ఞ స్తస్యాగ్ని రధిదైవతం. సచాత్ర యత స్తస్మా ద్యజ్ఞోపవీతమ్. (౨-౨-౧౫)

తా॥ వాచ్య వాచకముల కభేదోపచారముచే వాక్కు యజ్ఞ మనబడును. 'తేజోమయీవాక్' ఇత్యాది ప్రమాణములవలన ఆ వాక్కుకు అగ్ని అధిదైవత మగును. అట్టి అగ్ని బ్రాహ్మణుని దక్షిణహస్తమం దుండును. కాన ఆ దక్షిణ హస్తమే యజ్ఞ మనబడును. దాని క్రింద నుండునది గాన యజ్ఞోపవీతము.

4 "యశ్చాయ మఙ్గుష్ఠ స్స విష్ణు స్స యజ్ఞ స్యాధిదైవతం,
తస్మా చ్చ భవతీతి తీర్థత్వా చ్చ" ౨-౨-౧౬

శ్లో॥ అఙ్గుష్ఠ స్తత్పదం ప్రోక్తం తర్జనీ త్వం పదం తథా,
తయోరసి పదం సంగః సా చిన్ముద్రా ప్రకీర్తితా."

ఇత్యాది ప్రమాణములచే అంగుష్ఠము మహావాక్యగత తత్పద స్థానీయ మగుటచే విశ్వవ్యాపక చైతన్యాత్మక విష్ణుస్వరూపమగును. "యజ్ఞో వై విష్ణుః" ఇత్యాది ప్రమాణములవలన ఆ విష్ణ్వాత్మకాంగుష్ఠమునకు యజ్ఞాధిదైవత్వ ముండుటవలన నంగుష్ఠము యజ్ఞశబ్దవాచ్య మగును.

అట్టి యంగుష్ఠముతో గూడిన దక్షిణబాహువుక్రింద నుండునది గాన యజ్ఞోపవీతము. మఱియు అంగుష్ఠ మూలము బ్రహ్మతీర్థమగుటవలన యజ్ఞమగుచున్నది. అంగుష్ట మూల సంబంధముగల దక్షిణబాహువుక్రింద నుండునది గాన యజ్ఞోపవీతము.

## ఉపవీత పర్యాయపదములు

1శ్లో॥ పవిత్రం బ్రహ్మసూత్రం చ యజ్ఞోపవీత మిత్యపి.

— (*శబ్దకల్పద్రుమమున కల్కిపురాణము*).

2శ్లో॥ పవిత్రం బ్రహ్మసూత్రం ద్విజాయనీ ॥

— (*శబ్ద కల్పద్రుమము, త్రికాండ శేషము*).

3శ్లో॥ ఉపవీతం బ్రహ్మసూత్రం సూత్రం యజ్ఞోపవీతకమ్,
యజ్ఞసూత్రం దేవలక్ష్మ ఇత్యాఖ్యా షట్క్రమేణ తు.
— (భరద్వాజ స్మృతి).

4శ్లో॥ ఉపవీతం యజ్ఞ సూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే,
ప్రాచీనావీత మన్యస్మి న్నివీతం కంఠలమ్బితమ్. — (అమరకోశము).

ఉపవీయతే వామస్కంధః అనే నేత్యుపవీతమ్.
ఎడమభుజము దీనిచే కప్పబడుచున్నది.

ఆవీయతే ఆవీతమ్, ప్రాచీనం చ తత్ ఆవీతం చ ప్రాచీనావీతమ్.
ప్రాచీనమైన దక్షిణబాహువు కప్పబడుచున్నది.

'నియతం వీయతే నివీతమ్.'
నియతముగా గప్పబడుచున్నది.
— (అమరకోశ లిఙ్గాభట్టీయ వ్యాఖ్యానము).

## యజ్ఞోపవీతలక్షణము, ప్రయోజనము

ఇక నీ యజ్ఞోపవీతమును శ్రుతులెట్లు విధించుచున్నవో విచారింతము.

### (సంస్కృతము)

అవ॥ తత్రాద్యేఽనువాకేఽధ్యయనాంగత్వేన యజ్ఞోపవీతం విధాతుం తత్ప్రశంసార్థ మాదా వుపాఖ్యాన మాహ.

శ్రు॥ సహ వై దేవానాం చాసురాణాం చ యజ్ఞౌ ప్రతతా వాస్తాం వయగ్గ్ స్వర్గం లోక మేష్యామో వయ మేష్యామ ఇతి తే సురా స్సన్నహ్య సహసై వాచరన్ బ్రహ్మచర్యేణ తపసైవ దేవా స్తే సురా అముహ్యగ్గ్ స్తేన ప్రాజానగ్గ్స్తే పరాభవ స్తేన స్వర్గం లోక మాయన్ ప్రసృతేన వై యజ్ఞేన దేవా స్స్వర్గం లోక మాయ న్న ప్రసృతే నాసురాన్ పరాభావయన్.

విద్యారణ్యభాష్యము వయమేవాధిపత్యనిమిత్తం స్వర్గం గమిష్యామ ఇత్యేవం దేవా యదా యజ్ఞే ప్రవృత్తా, స్తదానీమేవ అసురా అపి తథై

వాభిప్రేత్య యజ్ఞేప్రవృత్తాః. తా వుభౌ యజ్ఞౌ ప్రతతౌ విస్తీర్ణౌ వాస్తామ్. తదానీం తథావిధా అసురా స్వంవస్యా కృతసన్నాహాః సహసైవ భుజబలా న్న శాస్త్రైర్నైవాఽచరన్. యజ్ఞ మారబ్ధవన్తః. తే మౌర్ఖ్యాత్ బ్రహ్మచర్యాది నియమం చానాదృతవన్తః. దేవాస్తు బ్రహ్మచర్యేణ సమస్తతపసా యుక్తా స్సన్తో యథాశాస్త్ర మనుష్ఠితవన్తః. తే మూర్ఖా అసురా అముష్యా న్మౌర్ఖ్యపారవశ్యేన మోహం ప్రాప్తాః. మూఢా స్సన్తః కర్తవ్యాఽకర్తవ్యం కిమపి న ప్రాజానన్. తతో యథాశాస్త్రానుష్ఠానాభావాత్ స్వర్గం న ప్రాప్తాః. దేవాస్తు ప్రసృతేనైవ యజ్ఞేన స్వర్గం ప్రాప్తాః. అప్రసృతేన యజ్ఞేన యుక్తా నసురా న్పరాభావయన్.

అథ ప్రసృతాఽప్రసృతయో స్స్వరూపం విభజతే.

శ్రు॥ ప్రసృతో హ వై యజ్ఞోపవీతినో యజ్ఞోఽప్రసృతో ఽనుపవీతినో యత్కించ బ్రాహ్మణో యజ్ఞోపవీ త్యధీతే యజత ఏవ తత్.

విద్యా. భా॥ యజ్ఞోపవీతయుక్తస్య యో యజ్ఞః సోఽయం గుణా ధిక్యా త్ప్రసృతః ప్రకర్షేణ వృత్త ఇత్యుచ్యతే. అనుపవీతినో యజ్ఞోపవీత రహితస్య యజ్ఞో గుణవిహీనత్వా దప్రసృత ఇత్యుచ్యతే. కించ బ్రాహ్మణో యజ్ఞోపవీతయుక్త స్సన్ యత్కిమపి అధీతే తత్సర్వం యాగానుష్ఠానసమం భవతి.

అవ॥ త దేవం యజ్ఞోపవీతం ప్రశస్య అధ్యయనోపయోగం వదన్ యజ్ఞానా మఙ్గత్వేన విధత్తే.

శ్రు॥ తస్మా ద్యజ్ఞోపవీ త్యేవాధీయీత. యాజయే ద్యజేత వా యజ్ఞస్య ప్రసృత్యై.

విద్యా.భా॥ ప్రసృతిః ప్రకృష్ట గుణయుక్తత్వమ్,

అవ॥ యజ్ఞోపవీత సాధనం ద్రవ్యం విధత్తే.

శ్రు॥ అజినం వాసో వా దక్షిణత ఉపవీయ.

విద్యా.భా॥ కృష్ణాజినవస్త్రయో రన్యతరద్రవ్యం దక్షిణ భాగే లంబ మానం కృత్వాఽధీయేత ఇత్యర్థః. ఏవం అధ్యయవాదా వనేనైవ వాక్యేన

విహితస్యాపి యజ్ఞోపవీతస్య దర్శపూర్ణమాస ప్రకరణే నివీతం మనుష్యాణా మిత్యత్ర పునర్విధానం త దతిక్రమే తత్రత్య విశేషప్రాయశ్చిత్తార్థమ్.

అవ॥ యజ్ఞోపవీతప్రసఙ్గే త్రయాణామపి లక్షణం దర్శయతి.

శ్రు॥ దక్షిణం బాహు ముద్ధరతేఽవధత్తే సవ్యమితి యజ్ఞోపవీత మేతదేవ విపరీతం ప్రాచీనావీతగ్ం సంవీతం మానుషమ్.

విద్యా.భా॥ దక్షిణం బాహు మూర్ధ్వం ధృత్వా సవ్యే బాహౌ లమ్బమానే సతి య ద్వేష్టనం తద్యజ్ఞోపవీతమ్. ఏతదేవ విపరీతం సవ్యబాహో రూర్ధ్వధారణం దక్షిణబాహో ర్లంబమానం చే ద్భవతి. తదా వేష్టనం ప్రాచీనావీత మిత్యుచ్యతే. బాహ్వో రుభయో రప్యధో లంబమానయో రంసద్వయే యద్వేష్టనం తత్ సంవీతం. తదేత న్మానుషం మనుష్యాణాం ఋషీణామ్ యజ్ఞోపవీతం. దేవానాం యథా ప్రాచీనావీతం పితౄణాం తద్వత్.

శ్రు॥ ... ... ... ... తత్రాదౌ తావ ద్యాగకర్తౄణా ముపవీతం విధాతుం ప్రస్తౌతి.

శ్రు॥ నివీతం మనుష్యాణాం, ప్రాచీనావీతం పితౄణా, ముపవీతం దేవానామ్. — (కృ.య. సం. ౨-౫-౧౧).

విద్యా.భా॥ యత్రోభావపి బాహూ న్యగ్భూతౌ సన్తౌ బ్రహ్మసూత్రేణ వస్త్రేణ వా వీయేతే సంవృతౌ వాచ్ఛాదితౌ క్రియేతే తన్నివీతం. త చ్చ మనుష్యాణాం కార్యేషు ప్రశస్తం. తస్మా దృషితర్పణం నివీతయుక్తైః పురుషై రనుష్ఠీయతే. ప్రాచీనో దక్షిణో బాహు రాధీయతే ఽథస్తా త్క్రియతే యత్ర తత్ప్రాచీనావీతం. తచ్చ పితౄణాం కర్మణి ప్రశస్తమ్. అత ఏవ శిష్టాః ప్రాచీనావీతయుక్తాః పిండదానం కుర్వన్తి. ఉపవీతస్య లక్షణం స్వాధ్యాయబ్రాహ్మణే సమామ్నాతమ్. "దక్షిణం బాహు ముద్ధరతే ఽవధత్తే సవ్యమితి యజ్ఞోపవీతమ్". తచ్చ దేవానాం కర్మణి ప్రశస్తం. అత ఏవ శిష్టా స్స్వాధ్యాయాదికం తథైవాచరన్తి.

అవ॥ ఇదానీం విధత్తే.

శ్రుతి ఉపవ్యయతే దేవలక్ష్మమేవ తత్కురుతే.

విద్యా.భా॥ తత్తేనోపవీతేన దేవలక్ష్మమేవ దేవచిహ్నమేవ కృతం భవతి.

భట్టభాస్కరః :- దేవానామేవ తేన లక్షణం కృతం భవతి.

## తెలుగు తాత్పర్యము

### మొదటి శ్రుతికి తాత్పర్యము

దేవతలు స్వర్గాధిపత్యముకొఱకు యజ్ఞము జేయ సంకల్పింప రాక్షసులును నందుకొఱకే యజ్ఞముజేయ సంకల్పించిరి. ఆ దేవతలు, రాక్షసులొనరించు యజ్ఞములు మిక్కిలి గొప్పవి. పిమ్మట రాక్షసులు కృతసన్నాహులై శాస్త్రనియమమును పాటింపక బ్రహ్మచర్యమును లెక్కచేయక కేవల మౌర్ఖ్యముతో, భుజబల ప్రాధాన్యముతో యజ్ఞమును చేసిరి. దేవతలన్నచో బ్రహ్మచర్యముతోగూడిన తపస్సుతో శాస్త్ర నియమము నతిక్రమింపక యజ్ఞమును చేసిరి.

రాక్షసు లిట్లు అజ్ఞానముతో కర్తవ్యాఽకర్తవ్యముల దెలిసికొనకపోవుట వలన స్వర్గమును పొందలేకపోయిరి. దేవతలు శాస్త్రవిధిగ ననుష్ఠించిన యజ్ఞముచే స్వర్గాధిపత్యమును పొంది, శాస్త్రవిధి ననుసరించి యజ్ఞము చేయని రాక్షసులను పరాభవించిరి. అటుపిమ్మట శాస్త్రవిధి ననుసరించి యజ్ఞము చేయుటెట్లో శ్రుతియే నిరూపించుచున్నది.

యజ్ఞోపవీతయుక్తుడైనవాని యజ్ఞము బాగుగ జరిగిన(శాస్త్రవిధి ననుసరించిన)దని చెప్పబడుచున్నది.

ఉపవీతరహితుని యజ్ఞము గుణవిహీనమైనది గాన బాగుగ జరుగలేదని చెప్పబడుచున్నది.

ఇంతియుగాక బ్రాహ్మణుడు యజ్ఞోపవీతయుక్తుడై యే కొంచెము వేదము చదివినను నది యంతయు యాగానుష్ఠాన సమమగుచున్నది. అందువలన యజ్ఞోపవీతయుక్తుడైయే చదువవలయును, యజ్ఞమాదిక గుణముగలదగుటకు యజ్ఞోపవీత యుక్తుడై యజింపచేయవలయును;

యజించవలయును. కృష్ణాజిన వస్త్రములలో నేదేని యొకదానిని ఉప వీతముగ జేసికొని, చదువుట మొదలగు సత్కర్మల నాచరింపవలెను. కుడిచేయి పైగా నుండునట్లు నెడమభుజము నుండి వ్రేలాడుచుండునట్లు చుట్టుకొనియున్న జన్నిదము సవ్యమగు యజ్ఞోపవీత మనబడును. దీనికి విపరీతముగ నెడమచేయి పైగా నుండగ, కుడిభుజమునుండి వ్రేలాడెడు జందెము ప్రాచీనావీత మనబడును. రెండు చేతులు క్రిందికి వ్రేలాడుచుండ భుజశిరస్సులందు వ్రేలాడు జందెము నివీతమై మానుషమనబడును.

అనగా దేవతల కుపవీతము, పితృదేవతలకు ప్రాచీనావీతము, ఎట్లు ప్రశస్తమైనవో; అట్లే ఈ నివీతమును ఋషులకు బ్రశస్తమైనదని తాత్పర్యము.

## రెండవ శ్రుతికి తాత్పర్యము

ఎప్పుడు రెండు చేతులు క్రిందికి వ్రేలాడుచు బ్రహ్మసూత్రముచేగాని, వస్త్రముచేగాని కప్పబడిన వగుచున్నవో అట్లుండుట నివీత మనిపించుకొని శిష్టు లాచరించు ఋషితర్పణాదులం దానుకూల్యమును వహించుచున్నది. కుడిభుజ ముపవీతముచే క్రిందుగ జేయబడినపుడు ప్రాచీనావీత మనిపించు కొని పండితు లాచరించు పిండదానాదులం దుపయోగకరమగుచున్నది. దక్షిణ బాహువు పైనుండ నుపవీతముచే నెడమభుజము కప్పబడుట యుప వీత మనిపించుకొని యయ్యది దేవకర్మలందు ప్రశస్తమైనదై శిష్టు లాచరించు స్వాధ్యాయ యజ్ఞాదులం దుపయోగకరమగుచున్నది.

మఱియును ఉపవీతముచే దేవచిహ్నమే చేయబడుచున్నదని తాత్ప ర్యము.

## యజ్ఞోపవీతధారణము దేవచిహ్నధారణము

ఈ శ్రుతులవలన మనకు యజ్ఞోపవీత ధర్మము తెలియుటయే గాక యెడమభుజము మీదుగా ధరింపబడెడి యజ్ఞోపవీతముచే మనము దేవచిహ్నము గలవారమని హర్ష పూర్ణస్వాంతముతో యజ్ఞోపవీత ధారణ మందలి ప్రయోజనమును దెలిసికొనుచున్నాము. మఱియు అది విశ్వ

ధార్యమైనదనియు, వద్దానివి ధరింపక యజ్ఞ మొనరించిన రాక్షసు లెట్లు ఫలవిరహితులైరో, అట్లే ధరింపక వైదికకర్మ లాచరించువారును ఫల విరహితులగుదురనియు, ఆ యజ్ఞోపవీతము దేవ, ఋషి, పితృకర్మలందు ఉపవీత, నివీత, ప్రాచీనావీతములతో నుండవలయుననియు, ఆ యజ్ఞోపవీత వస్తువు లజిన వాసస్సులనియును దెలియుచున్నది. ఇందువలన నిచట ముఖ్యముగా గమనించదగిన విషయ మొకటి యుంటున్నది.

దేవలక్ష్మమన మనచే నిత్య మగ్నిహోత్రాది ద్వారముగ నారాధింపబడు దేవతలచిహ్న మగుటవలన నది తత్పూజా సాధనమేగాక, మనకు దైవ సంపత్సంపాదకమై "దైవీసంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా" యనుగీతోక్తిని ప్రతి వ్యక్తియందుండి సర్వదా జ్ఞాపకముచేయు పవిత్రమగు ఆర్య జాతీయ మహోత్తమ చిహ్నమని మనము తెలిసికొని దానిని ప్రకాశింప జేయవలసినవారమై యున్నాము.

శివుడును, మంగళార్థమై యజ్ఞోపవీతమును ధరించుచున్నాడు.

ఇటు చూడుడు! ఉపవీత మహిమను శ్రుతి యెట్లు చెప్పుచున్నదో!!

ఆదిదేవుడును, సర్వమంగళాకరుడును, సర్వమంగళా పతియు నగు మహాదేవుడు సయితము ఉపవీతమును మంగళముకొఱకు ధరించుచున్నాడట. ఉపవీతధారణమున మంగళాచారము గలవాడట.

శ్రు॥ నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః

— (యజుస్సంహిత ౪-౫-౨).

విద్యా.భా॥ ఉపవీతినే = మఙ్గళార్థం యజ్ఞోపవీతధారిణే.

భ.భా.భా॥ ఉపవీతినే = యజ్ఞోపవీతినే మఙ్గళాచారాయేత్యర్థః.

## అజినోత్తరీయములే యజ్ఞోపవీతములు

ఇట్లు శ్రుత్యాదేశమున యజ్ఞోపవీత ద్రవ్యములగు నజిన వాసస్సులలో అజినము (1) అజినంత్వే వోత్తరం ధారయేత్ ॥భా॥ ఉత్తర ముత్తరీయం అజినమేవ ధారయేత్॥ ఆప.ధ. ౧-3-30॥ అను సూత్రముచే బ్రహ్మచారికి

ఉత్తరీయమై యుండియు వస్త్రము గృహస్థునకు (2) నిత్య ముత్తరం ... ... ... వాసః కార్యమ్॥ భా॥ ... ...నిత్య ముత్తరం వాసో ధార్యమ్. ... ... ఆప.ధ.౨-౪-౨౧ అను సూత్రముచే నుత్తరీయమైయుండియు పిమ్మట (3) యజ్ఞోపవీతీ ద్వివస్త్రః ॥భా॥ యదా ద్వివస్త్రః తదా వాససాన్యతరేణ యజ్ఞోపవీతీ స్యాత్ 'అపి వా సూత్రమేవోపవీతార్థే, ఇత్యేషకల్ప స్తదా న భవతి' ఆప.ధ. ౧-౬-౧౮.

అను సూత్రముచే నుపవీత క్రియాసాధనములైనవి యజ్ఞోప వీతములని పిలువబడుచున్నవి.

ఇందలి 1,2,3 సూత్రములకు బ్రహ్మచారి కజిన ముత్తరీయమనియు, గృహస్థు నిత్యముగా నుత్తరీయమును ధరించవలయుననియు, బ్రహ్మచారి గృహస్థు లిరువురు ధోవతియు (కట్టుబట్ట) నుత్తరీయము గలవారుగ నుండిన యెడల సూత్రరూప యజ్ఞోపీతముగలవారుగ నుండినప్పటికి నుత్తరీయముతో యజ్ఞోపవీతులైయే యుండవలయుననియు నర్థము.

## పక్షాంతరమున సూత్ర ముపవీతము

ఇట్టి యజ్ఞోపవీతము నిత్యమగుటచే సర్వాశ్రమముల వారికి సవ్యా – పసవ్యముల కనువుగ నుండి ప్రమాదత్యాగము, అసంభవము, మొదలగు దోషములను జేరనీయకుండుటకు – 'అపి వా సూత్రమేవోపవీతార్థే' భా॥ అపివా సూత్రమేవ సర్వేషా ముపవీతకృత్యే భవతి న వాస ఏవ ॥ ఆప. ధ. ౨-౪-౨౨ ॥ (ఉత్తరీయమేగాక పక్షాన్తరమున సూత్రమే అందఱ కుపవీత మగుచున్నది.) అను సూత్రముచే ననుకల్పమగు సూత్ర రూపము నొందినది.

## స్మృత్యనువాదము

ఈ యర్థమునే యౌశనస స్మృతి యనువదించుచున్నది. ఔశనస స్మృతి. అ. ౫.

శ్లో॥ పురా బ్రహ్మోపవీతేన బ్రాహ్మణ్య మసృజ త్ప్రిభుః,
తస్మా త్సదోపవీతీ స్యా ద్బ్రాహ్మణ్య స్యైకసిద్ధయే.

శ్లో॥ వాచస్పతి ర్వాససైవ చక్రే స్వ ముపవీతినమ్,
చక్రే వాచస్పతి స్సోమ మజినేన తదుక్తితః.

శ్లో॥ తస్మా త్సదా ద్విజాతినా ముపవీతం తథా విధమ్,
ప్రశస్యతే వాసహత మజినం చైవ ధారయేత్.

— (వాసహతం = వస్త్రకృతమ్).

శ్లో॥ ఉపవీతం సదా విప్ర స్సర్వకర్మసు సంతతమ్,
ఉపవీతస్య తు ద్రవ్యే <u>కృతి ర్వాసశ్చ</u> దేహినామ్.

శ్లో॥ తాదృశం తత్సదా ధర్తు మఖిలానాం ద్విజన్మనామ్,
హితమేవేతి నిశ్చిత్య సమాలోచ్య ప్రజాపతిః.

శ్లో॥ అశక్యత్వేన చాలోచ్య తస్య సంపాదనస్య చ,
... ... ఇతి ధ్యాత్వా ముహూర్తం తు చకార కిల నిశ్చయమ్.

శ్లో॥ ఉపవీతం సూత్రమేవ ధార్యత్వేన ద్విజన్మనామ్, ... ...
... ... తదేత ద్యజ్ఞసూత్రం స్యా త్సర్వకర్మైక సాధనమ్.

అనగా పూర్వమున బ్రహ్మదేవు డుపవీతముతో బ్రాహ్మణ్యమును సృజించెను. ఆ కారణమువలన బ్రాహ్మణుడు తప్పక బ్రాహ్మణత్వ సిద్ధికొఱ కుపవీతియై యుండవలయును. వాచస్పతి తనను వస్త్రముతోనే యుపవీతునిగా జేసికొనెను. సోముని కోరిక ననుసరించి వాచస్పతి యతనిని నజినముతోనే యజ్ఞోపవీతునిగా జేసెను.

ఈ కారణమువలన ద్విజాతులకు అజినోత్తరీయ రూపములగు నుపవీతములు ప్రశస్తము లగుచున్నవి. <u>ఉపవీతద్రవ్యము లజిన వాసస్సులు</u>. ద్విజాలు వాని నెప్పుడును ధరించుటలో మేలు గలదు. కాని వానిని సంపాదించి సర్వదా ధరించుట యశక్యమని తలచి కొంతసేపు ఆలోచించి, వీటికి బదులు

ద్విజులకు యజ్ఞ సూత్రమే ధరించదగినదని నిశ్చయించుకొని సమస్త వైదిక కర్మలకు పరమ సాధనమగు యజ్ఞసూత్రమును విధించినవాడాయెను.

## సందేహ నివారణము

కాని ఉత్తరీయ ముపవీత మెట్లగును? అను సందేహము విడువనిదై యున్నది.

వినుడు! ఆపస్తంబ మహర్షి 'యజ్ఞోపవీతి ద్వివస్త్రః' అని విధించిన సూత్రమును జదివియే యున్నారు. ఇదిగాక 'నిత్య ముత్తరం వాసః కార్యమ్' ఆప.ధ. ౨-౪-౧౨. నిత్య ... ... ముత్తరం వాసో ధార్య మిత్యుచ్యతే:-

అను సూత్రమును రచియించి, ఈ సూత్రమందలి యుత్తరవాస శ్శబ్దమును 'అపి వా సూత్ర మేవోపవీతార్థే' ఆప.ధ. ౨-౪-౨౨ అను సూత్రమున నుపవీతశబ్దముతో గ్రహించి ఆ యుపవీతస్థానమున వికల్పముగ సూత్రమును విధించుచుండుటచే నుత్తరీ యోపవీత శబ్దములు పర్యాయ పదములని కూడ తెలియవచ్చుచున్నది. కనుకనే హరదత్తులు "ఉపాసనే గురూణాం వృద్ధానా మతిథీనాం హోమే జప్యకర్మణి భోజనే ఆచమనే స్వాధ్యాయేచ యజ్ఞోపవీతీ స్యాత్" ఆప.ధ. ౧-౧౫-౧ అను సూత్రమున "వాసో విన్యాస విశేషో యజ్ఞోపవీతం" అని యజ్ఞోపవీత ద్రవ్యముగ గ్రహించిన వాసస్సు ఉత్తరీయ రూపమని విజ్ఞులు గ్రహింపకపోరు.

ఇందువలనగూడ నుపవీ తోత్తరవాస శ్శబ్దములు పర్యాయ పదములే యని దృఢముగ దెలిసికొనవచ్చును. ఇట్టి యుపవీత ద్రవ్యముగ నాపస్తం బులేగాక మనుస్మృతి వ్యాఖ్యాతయగు కుల్లూకభట్టు గూడ "ఉద్ధృతే దక్షిణే పాణౌ" అను శ్లోక వ్యాఖ్యానమున "యజ్ఞసూత్రే వస్త్రే వా" అనియు శబ్దకల్ప ద్రుమమున నిగమ పరిశిష్టకారుడు "వాససా యజ్ఞోపవీతం కురుతే. తదభావే త్రివృతా సూత్రేణ కుశ బాల ముంజ ప్రతిసర రజ్జుభి ర్వా" అనియు, విద్యా రణ్యులు "నివీతం మనుష్యాణాం" అను శ్రుతిభాష్యమున "యత్ర ఉభావపి బాహూ బ్రహ్మసూత్రేణ వస్త్రేణ వా వీయేతే" అనియు, వీరమిత్రోదయమున ఋష్యశృంగుడు "అపి వా, వాససా యజ్ఞోపవీతం కుర్యా త్తదభావే త్రివృతా

సూత్రేణ" అనియు, వైద్యనాథ దీక్షితులు "వాససోఽసంభవే అను కల్పత్వేన సూత్రస్యాభిధానాత్"అనియు శ్రుతివిహితమగు వస్త్రమును, తదభావమందు సూత్రమును గ్రహించియున్నారు. ఇందువలన గూడ నుత్తరవాసస్సే యుప వీతమనియు, తత్ప్రతినిధిగ తత్ స్థానాపన్నమయినది సూత్రమనియు గూడ మనము గ్రహించుచున్నాము.

ఇట్టి యుపవీతసాధనములగు నుత్తరీయములలో నాపస్తంబమహర్షి బ్రహ్మచారికి 'అజిన ముత్తర ముత్తరయా' ఆప.గృ. ४-౧౦-౧౦ అను సూత్రముచే నజినోత్తరీయముయొక్కయు, స్నాతకునకు బాదరమణి ధార ణానంతరమున "అహత ముత్తరం వాసో రేవతీ స్త్వేతి సమానమ్" (ఆప.గృ. ५-౧౧-८) అను సూత్రముచే నుత్తర వాసస్సు యొక్కయు మంత్రయుతములగు ధారణములను విధించెను.

ఇట్లే ఆశ్వలాయనాదులును వారి వారి ధర్మముల ననుసరించి తమతమ గృహ్య సూత్రములలో వజీన వాసస్సులను విధించిరి.

## మను బోధాయనోపవీతములు

ఇప్పటి కుదాహరింపబడిన శ్రుతి స్మృతులచేతను ఆపస్తంబ సూత్ర కారునిచేతను విధింపబడిన యజ్ఞోపవీతమును దాని ధర్మములను తెలిసి కొనియుంటిమి. ఇక, బోధాయన సూత్రకారునిచే విధింపబడిన యజ్ఞో- పవీతమును తద్ధర్మములను దెలియబఱచి, పిమ్మట ఆశ్వలాయన గోభిలాది సూత్రకారులయొక్కయు, మిగిలిన స్మృతికారులయొక్కయు యజ్ఞోపవీత విశేషములను ప్రాసంగికముగ దెలియజేసెదను.

**"కౌశం సౌత్రం వా త్రి స్త్రివృ ద్యజ్ఞోపవీత మానాభే ర్దక్షిణం బాహు ముద్ధృత్య, సవ్య మవధాయ, శిరోఽవ దధ్యాత్, విపరీతం పితృభ్యః. కంఠేఽవసక్తం నివీతమ్, అధోఽవసక్త మధోవీతమ్.**

— *(బో.ధ.ప్ర.౧. అ.५. సూ.५-६-౭-८).*

అనగా దర్భతోగాని ప్రత్తితోగాని నిర్మింపబడిన తొమ్మిదిపేటలు గల సూత్రము నాభివఱ కుండుచు, విన్యాసవిశేషముచే నుపవీత ప్రాచీనావీత నివీత ధర్మములు గలదగుచున్నదని తాత్పర్యము. అధోవీత మన మనుష్య కార్యములగు అంజనాభ్యంజ నోద్వర్తనకర్మలందు నడుమునకు చుట్టుకొనుట - అని యర్థము.

వ్యా॥ "మనుష్యకార్యేషు కర్తవ్యం తాని అంజనాభ్యఞ్జనోద్వర్తనాని" ఇచట ఆదిశబ్దముయొక్క ఆవశ్యకత కనుపించుచున్నది. ఇట్టి యజ్ఞోపవీతము బోధాయన సూత్రుల కుపనయనమున "... ... కుమారం భోజయిత్వా తస్య చౌలవ త్తూష్ణీం కేశానోప్య స్నాతం శుచివాససం బద్ధశిఖం యజ్ఞోపవీతం ప్రతిముఞ్చ వాచయతి యజ్ఞోపవీతం పరమం పవిత్రమితి." భో.గృ. ౫-౨.

అను సూత్రముచే కుమార భోజనము, వపన సంస్కారము నైనపిమ్మట ప్రాప్తమగుచున్నదని తెలియుచున్నది. స్నాతక గృహస్థ ప్రకరణములలో నిట్లు గలదు.

"ద్వియజ్ఞోపవీతీ" బో.ధ.౧-౩-౫ స్నాతకుడు రెండు యజ్ఞోపవీతములు గలవాడై యుండవలయును. "నిత్యోదకీ నిత్య యజ్ఞోపవీతీ ... ... ... న బ్రాహ్మణ శ్చ్యవతే బ్రహ్మ లోకాత్ (బో.ధ. ౨-౨-౧) అనగా సూత్రోక్త కర్మలుగలిగి నిత్య యజ్ఞోపవీతియైనవానికి బ్రహ్మలోక చ్యుతి లేదని తాత్పర్యము.

మరియు 'జీర్ణే ఛేదే వినాశే వా' అనిమొదలుగా గలుగు గృహ్యసూత్రముచే నిర్మాణాది ధర్మములు బోధింపబడినవి. ఇట్లు చెప్పబడిన యజ్ఞోపవీత ధర్మములన్నియు బోధాయన మతమున సూత్రవిషయము లేనని మనకు తెలియును. కాని,

బోధాయనమహర్షి

శ్లో॥ "అగ్న్యగారే గవాం మధ్యే బ్రాహ్మణానాంచ సన్నిధౌ,
స్వాధ్యాయే భోజనేచైవ దక్షిణం బాహు ముద్ధరేత్"

బో.ధ. ౨-౩-౩.

అగ్నిహోత్ర గృహమున, గోమధ్యమున, బ్రాహ్మణ సన్నిధానమున, వేదమును చదువునపుడు, భోజన సమయమున వస్త్రములో నుపవీతిగా నుండవలయును. అనుటచేతను—

శ్లో॥ ఉత్తరం వాసః కర్తవ్యం పఞ్చస్వేతేషు కర్మసు,
స్వాధ్యాయోత్సర్గ దానేషు భుక్త్యాచమనయో స్తథా.

*బో. ధ. ౨-౩-౨౭*

స్వాధ్యాయ ఉత్సర్గ దాన భోజన ఆచమనములయం దుత్తరీయముతో నుపవీతముగా నుండవలయును. అనుటచేతను,

"అజినం వాస స్సూత్రం వా ద్వితీయం యస్య యద్భవతి తేన స ఉపవ్యయతే దేవలక్ష్మమేవ తత్కురుతే ఇతి బ్రాహ్మణమ్."(బో.వ. ౨-౪-౧)

(పురుషార్థ సూత్రముతోనేగాక అజినోత్తరీయ సూత్రములలో దేనితో నైన ఉపవీతిగా నుండవలయును) అని అనుటచేతను,

యజ్ఞోపవీతమునకు అజినవాసః ప్రాధాన్యము చూపబడుచున్నది. ఇందువలన బోధాయన మహర్షికి సూత్రోపవీతముతో గూడ నుత్తరీయ సహత్వ మావశ్యకమై యున్నది. దీనినిబట్టి ఆపస్తంబ బోధాయన మతము లలో వ్యవహార భేదమేగాని ఉపవీత ద్రవ్యములలో భేదమేమియును లేదు. ఆపస్తంబు లుత్తరీయము నుపవీతమనుచు సూత్రమునకు సహత్వ మంగీ కరించిరి. బోధాయనులు సూత్రము నుపవీతమనుచు నుత్తరీయమునకు ప్రతినిధిత్వ మంగీకరించిరి. మనువు నిట్లే,

శ్లో॥ కార్పాస ముపవీతంస్యా ద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్,
శణసూత్రమయం రాజ్ఞో వైశ్యస్యావిక సౌత్రికమ్. —(౨-౪౪).

తా॥బ్రాహ్మణునకు పైకి పేనబడిన మూడు పేటలుగల ప్రత్తిదార మును, క్షత్రియునకు జనుపనారతో నిర్మింపబడినదియు, వైశ్యునకు గొఱ్ఱెయొక్క రోమములతో నిర్మింపబడినదియు నుపవీత మగుచున్నదని యుపవీత ద్రవ్యములను విధించియు,

శ్లో॥ ఉద్ధృతే దక్షిణే పాణా వుపవీ త్యుచ్యతే ద్విజః,
సవ్యే ప్రాచీన ఆవీతీ నివీతీ కంఠసజ్జనే. -(౨-౬3).

అని యజ్ఞసూత్రమునకు యజ్ఞోపవీతమను పేరుతో నుపవీత ప్రాచీనా వీత నివీతధర్మములను జూపి—

శ్లో॥ అగ్న్యగారే గవాం గోష్ఠే బ్రాహ్మణానాం చ సన్నిధౌ,
స్వాధ్యాయే భోజనేచైవ దక్షిణం బాహు ముద్ధరేత్. -(౪-౫౮).

తా॥ అగ్నిహోత్ర గృహమునను, గోశాలయందునను, బ్రాహ్మణ సన్నిధానమందును, వేదము జదువునపుడును, తాను భోజనము జేయునపుడును వస్త్రముతో నుపవీతిగా నుండవలయునని బోధించుచున్నాడు.

"పాణిం సబాహుం వాససః బహిష్కుర్యాత్"

— (మనుస్మృతి వ్యాఖ్యాన పక్షకమ్).

ఇట్లు మన్వాపస్తంబ బోధాయనులకు స్వరూపతః సామరస్య ముంటున్నది. అధోవీతమనునది బోధాయన మతముననే కనుపించుచున్నది. ఇక నీ యజ్ఞోపవీత విషయమున బోధాయన ధర్మవాఖ్యానము విమర్శింపక తప్పని దగుచున్నది.

## బోధాయన ధర్మవ్యాఖ్యాన విమర్శనము

దీని ప్రణేత గోవిన్దస్వామి పండితుడు. ఈయన,

శ్లో॥ ఉత్తరం వాసః కర్తవ్యం పఞ్చ స్వేతేషు కర్మసు,
స్వాధ్యాయోత్సర్గ దానేషు భుక్త్వాచమనయో స్తథా.

-(బో.ధ. ౨-3-3౭).

అను సూత్రమున "తృతీయం వస్త్ర ముపవీతవ ద్వ్యతిషజ్యతే. తదుత్తరీయం తత్స్నాతకస్య ప్రాప్య మష్వేషు కర్మస్వవశ్యకర్తవ్య మిత్యుచ్యతే. ఉత్సర్గో మూత్ర పురీషకరణం" అనియు, స్నాన ప్రకరణమున "పవిత్రే కృత్వా ... ... వాసాంసి ... ... పరిధాయ" (బో.ధ.౨-౫-౧౨) అను

సూత్రమున "బహువచనా దన్తర్వాసపో బహిర్వాసప — ఉత్తరీయస్య చ గ్రహణమ్" అనియు నుత్తరీయమును మూడవ వస్త్రముగ వ్యాఖ్యానించెను.

కాని విచారింప బోధాయనమహర్షి"... ... అహతం వాపః ప్రావారంచ వసనాన్తరం బాదరమణీ ... ... ఉపక్ల్ప్తా భవన్తి." బో.గృ. ప. ౧-౩-౧.

"అథైతేషా మత ఊర్ధ్వం నిత్యాని భవన్తి ... ... ద్వే వాపసీ ద్వే యజ్ఞోపవీతే ... ... అజిన మన్తర్వాసః" బో.గృ.ప. ౧-౫-౨.

అను సూత్రములచే స్నాతకునకు ధోవతి (కట్టుపంచ)ని, ఉత్తరీయము (కండువ)ను, మఱియొక వస్త్రమును విధించుటలో ప్రావారశబ్దముచే నుత్తరీయమును రెండవదానినిగ బోధించుచుండ నిట్టి యుత్తరీయమును మూడవ దనుట యుక్తము గాదు. 'ప్రావార' మన నుత్తరీయమని "ద్వౌ ప్రావారోత్తరాసఙ్గౌ" అని అమరకోశము. మఱియు ధర్మసూత్రము మూడవ వస్త్ర ప్రవక్తియే లేక రెండవ వస్త్రమగు నుత్తరీయమును మాత్రమే స్నాతకునకు ధరింపదగినదిగ "ఉష్ణీష మజిన ముత్తరీయ ముపానహౌ... .... బో.ధ. ౧-౩-౬ అని విధించుచున్నది.

దీని కుపష్టంభకముగ ధోవతి యుత్తరీయము మాత్రమే కర్మార్థములు గాన ఈ రెండింటినే సంపాదించి దక్షిణగా నీయవలయునని పుత్త్రి ప్రతిగ్రహకల్పమున "పుత్త్రిం ప్రతిగృహీష్య న్నుపకల్పయతే ద్వే వాపసీ ద్వే కుండలే.." బో.గృ.శే.౬-౪.

"అథ దక్షిణాం దదా త్యేతే ఏవ వాపసీ ... ..." బో.గృ.శే. ౬-౯. అని విధించుచున్నాడు.

కాని మూడవ వస్త్రమును విధింపడు. కావున నుత్తరీయము రెండవ దనియును, మూడవవస్త్ర ముత్తరీయము గాక శారీరక ధర్మనిర్వహణార్థము మాత్ర మేర్పడినదనియును మనము తెలిసికొనుట యుక్తము.

వసిష్ఠస్మృతియు స్నాతకునకు రెండు వస్త్రములనే —

శ్లో॥ "స్నాతకానాంతు నిత్యం స్యా దన్తర్వాప స్తథోత్తరమ్."

అవి ధోవతిని, ఉత్తరీయమునే ఆదేశించుచున్నది.

వీరమిత్రోదయమున ఆహ్నిక ప్రకాశమున, స్నానానంతర వస్త్రపరిధాన విధానమందునను, రెండు వస్త్రములే ధరించవలసినవిగ గన్పట్టుచున్నవి. చూడుడు! (మత్స్యపురాణే)

శ్లో॥ ఏవం స్నాత్వా తతః పశ్చా దాచమ్య చ విధానతః,
ఉత్థాయ వాససీ శుక్లే శుద్ధేతు పరిధాయవై.
... ... వాససీ ఇతి అధఃస్థ వసన ముత్తరీయం చేత్యర్థః.

(రెండు వస్త్రములన, ధోవతి, ఉత్తరీయము) కావున నుత్తరీయ మును మూడవదనుట యుక్తము కాదు. ఈ విషయమింకను (పు.49) ద్వితీయోత్తరీయ వివాదమున విమర్శింపబడును.

ఇదిగాక శ్లో॥ "అగ్న్యగారే గవాం మధ్యే ... ... ఉద్ధరేత్." ౧ బోధ. ౨-౩-౩౮ అను సూత్రమందలి పదములకు "ఉత్తరం వాసః కర్తవ్యమ్ ..." (౨-౩-౩౮) అను సూత్రమందలి పదములకు సమానార్థకత యున్నందున గాబోలు "బాహో రుద్ధరణం" (కుడిచేయి పైగ నుండవలయును) అను వాక్యమును 'నమస్కారరూపేణ' అని వ్యాఖ్యానము జేసి సూత్రోక్తక్రియ లందు నమస్కారము చేయవలయునని వ్రాయుట అసంగతముగ గన్పట్టక పోదు.

పై సూత్రమున కర్థ మిదివరలో వ్రాయబడినది.

ఇంతియుగాక "ఉత్తరం వాసః కర్తవ్యమ్" అను సూత్రములోని ఉత్సర్గ పదమునకు మూత్ర పురీషమోచనమనియు వ్యాఖ్యానము చేసినాడు.

ఈ వ్యాఖ్యానము ననుసరించినయెడల శ్రుతి, స్మృతి, గృహ్యకారా నుమతమున యజ్ఞోపవీతమగు నుత్తరీయమును మూత్ర పురీషోత్సర్గ సమయములందు సవ్యముగ జేసికొని దానివలన గలుగు ప్రత్యవాయ మనుభవింపవలసివచ్చును. కావున నీ విషయమున నీ వ్యాఖ్యానము సహింపరానిదని విమర్శకులు గ్రహింపకపోరు. విశేషమేమన పండితులై యుండియు యజ్ఞోపవీత స్వరూపమునే మఱచి ఉత్తరీయముతో నివీత

ప్రాచీనావీతులై అధ్యయ నాధ్యాపన యజన యాజ నాచమన గురు నమస్కారాదులను ఉపవీతులై, మూత్ర పురీషోత్సర్గాదులను నడుముకు కట్టుకొని దేవతా గురువందనములను ఆచరించువారు తమ దురాచరణము నింతతో గట్టిపెట్టి యుత్తరీయోపవీత ప్రాముఖ్య మెల్లపుడు జ్ఞాపకమునం దుంచుకొని దానిని ప్రకాశింపజేయ ప్రార్థింపబడుచున్నారు.

ఇందులకు ప్రమాణ వచనముల జూడుడు!

"న యజ్ఞోపవీత ముత్తరీయం చావ్యధా ధృ త్వాచామేత్."

— (స్మృత్యర్థసారము).

శ్లో॥ సవ్యా దంసా త్పరిభ్రష్ట కటిదేశ ధృతామ్బరః,
ఏక వస్త్రంతు తం విద్యా ద్దైవే పిత్ర్యే చ వర్జయేత్.

— (స్మృతిచన్ద్రిక).

యజ్ఞోపవీతమును ఉత్తరీయమును సవ్యముగ ధరించక ఆచమనమును జేయగూడదు. ఉత్తరీయము భుజమునుంచి జారినను, నడుమునకు కట్టుకొనినను ఉత్తరీయము లేనివాడే యగుచున్నాడు గాన, అట్టివాడు దైవ పితృకర్మలకు పనికిరానివాడని తాత్పర్యము.

"ఉత్తరం వాసః కర్తవ్యం" అను సూత్రమునకు సూత్రోక్తములగు నైదు కర్మలకంటె మిగిలిన నమస్కారాదులం దుత్తరీయముతో నవసర ముండదని వ్రాసిన వ్యాఖ్యాన మశ్లాఘ్యము.

"ఏత ద్విహిత సర్వకర్మోపలక్షణార్థమ్" అని. విహితములగు సర్వ కర్మలందిట్లే యుత్తరీయముతో నుపవీతిగా నుండవలయునని తెలిపిన పరా శర మాధవీయము, స్మృతిచంద్రికయు సర్వ స్మృతి సమ్మతములగుటచే సంశ్లాఘ్యములు.

## ఉత్సర్గ శబ్దార్థము

ఇచట ఉత్సర్గ శబ్దార్థ విచారణ మావశ్యకమై యున్నది. ఉత్సర్గ విసర్గ శబ్దములు పర్యాయపదములు. విసర్గ శబ్దమున కర్థమును, "విసర్గః కర్మసంజ్ఞితః" భగవద్గీత ౮ అధ్యా. 3 శ్లో.

అనుచోట శ్రీ శంకర భగవత్పాదులు "విసర్గో విసర్జనమ్ దేవతోద్దేశేన చరు పురోడాశాదే ర్ద్రవ్యస్య త్యాగః"

దేవత నుద్దేశించి చరు పురోడాశాదుల నిచ్చుట — అని వ్రాసిరి. కావున నిచట నుపసర్గ మాత్రముతో భేదము గలవిగ నున్నను విసర్గోత్సర్గ శబ్దములు సమానార్థము లనుట యుక్తము.

ఈ యర్థమునే పరాశర మాధవీయమందలి "స్వాధ్యాయోత్సర్గ దానేషు" అనుటకు బదులు "స్వాధ్యాయ హోమదానేషు" అను పాఠాన్తరము ధ్రువ పఱచుచున్నది.

కావున 'ఉత్సర్గ' మన హోమమని వ్యాఖ్యానమును జేయుట యుక్తము.

## సుదర్శన మత విమర్శనము

ఇట్లు అజినోత్తరీయములే యజ్ఞోపవీతమునకు ప్రధాన ద్రవ్యములైన యెడల ఆపస్తంబ గృహ్యభాష్యముల సుదర్శను లుపనయనాదియందును, కుమారభోజనమునకు ముందును, హరదత్తులు - కుమారభోజనము, వపనము, స్నానము నైన పిమ్మటను, ప్రధానమగు నజినధారణము లేకమున్నే యజ్ఞసూత్రధారణమును వ్రాసిరి. లోకము నట్లే యాచరించుచున్నది. దానికి గల కారణమేమి? అని ప్రశ్నింతురు.

వినుడు! పైన నుదాహరింపబడిన సుదర్శన హరదత్త భాష్యములలోనే గాక, కపర్దికారికల యందును

శ్లో॥ యజ్ఞోపవీత కాల స్స్యా ద్వాచనే కృత ఆశిషామ్,
పురస్తా త్సమిదాధానాత్ శివ స్వామి మతేన తు.

అని రెండు మతములు కనుపించుచున్నవి. కాని, ఇవి ఆపస్తంబాశ్వలాయనాద్యభిహితములు కాకపోగా యుక్తియుక్తములుగ గూడ కన్పట్టవు. ఎందువల్లనన! వీరిలో సుదర్శనులు 'ప్రాచీనావీతివా' (ఆప.గృ. ౧-౧-౮)

అను గృహ్యసూత్ర వ్యాఖ్యానమున 'ఇదం తు వాసో విన్యాస భేదవిధానమ్'- అని యజ్ఞోపవీత ద్రవ్యముగ వస్త్రమునే గ్రహించియు,

"బ్రాహ్మణాన్ భోజయి త్వాశిషో వాచయిత్వా కుమారం భోజయిత్వా ... ... (ఆప.గృ. ४-౧౦-౫).

అను సూత్రవ్యాఖ్యానమున

"అత్ర చ కుమారస్య స్వభోజనా త్ప్రాక్ 'యజ్ఞోపవీతం పరమం పవిత్ర' మిత్యాది ... ... మన్త్రేణ యజ్ఞోపవీతధారణం ... ... భోజన ఆచమనే స్వాధ్యాయేచ యజ్ఞోపవీతీ స్యాత్" —(ఆప.ధ. ౧-౧౫-౧).

ఇతి ధర్మ శాస్త్రవచనాత్' అని ఉపపత్తిని జూపుచు కుమారభోజనమున కంగముగ సూత్రరూప యజ్ఞోపవీతమును విధించుచున్నాడు. కాని 'ఉపాసనే ... ... భోజనే ఆచమనే' అను సూత్రముచే విధింపబడిన యజ్ఞోపవీతము "వాసో విన్యాస విశేషో యజ్ఞోపవీత"మను, హరదత్త భాష్యముచేతను పూర్వోదాహృత సూత్రార్థ విజ్ఞానముచేతను వస్త్రరూపమైనదిగాని సూత్రరూపమైనది గాదు. వస్త్రమన నిచట బ్రహ్మచారి కజినోత్తరీయమును, గృహస్థునకు కార్పాసోత్తరీయము నని లోగడ తెలిపినదేగాక వక్ష్యమాణ స్మృతివచనముల మూలమునను గూడ దెలియగలదు. సూత్రరూప యజ్ఞోపవీతమున కిచట (ఉపనయనాదిలో) ప్రసక్తియే లేదు. ఉన్నదనుకొనినను ఉపాసనే ... ... భోజనే ఆచమనే ... ... యజ్ఞోపవీతీ స్యాత్ ఆప.ధ. ౧-౧౫-౧ అను సూత్రము పరినిష్ఠితునకు (ఉపనయనమైన వానికి) వర్తించునదిగాని, అపరినిష్ఠితునకు (ఉపనయనము కాబోవువానికి) వర్తించునది గాదు.

ఇట్టి మీమాంసను నేనే చేయుచుండుట లేదు. ప్రాచీన నిబంధన కారులు పలువురు చేసియుండిరి. చూడుడు! సంస్కార రత్నమాలయందు వటువు దీక్షావస్త్రమును ధరించి చేయవలసిన యాచమనము వైదికమా? పౌరాణికమా? అని శంకను జేసికొని—

"ఆచమనం పౌరాణికమేవ న తు వైదికమ్"

శ్లో॥ వహ్యాస్మిన్ యుజ్యతే కర్మ కించి దామౌంజి బంధనాత్,
శూద్రేణచ సమస్తావ న్నతు వేదేవ యుజ్యతే.

ఇతి మనునా

"ఉపనయనానంతరమేవ వైదికకర్మాధికార ప్యోక్తత్వాత్"

అని వైదికాచమనమును నిరసించి పౌరాణికాచమనమే కర్తవ్యమని సమాధాన మీయబడెను. ఇట్టిది కనిపించుచుండ కుమార దీక్షాభోజనా వసరమున యజ్ఞసూత్రముతో నావశ్యక మేమి? ఉండిన నది హరదత్త మతమున లేకపోవుట యేమి? ఇది గాక ఆపస్తంబ గృహ్యసూత్రమందు వలెనే యజ్ఞసూత్రమును విధింపని గోభిల గృహ్య సూత్రముయొక్క భాష్యమున ఉపవీత మెప్పుడు ధరించవలయు? ననువిషయమున-

శ్లో॥ సదా మంత్రవ దాధార్య ముపవీతం ద్విజాతిభిః

అను న్యాయమువలన "ద్విజత్వ సంపత్త్యనంతరమేవ ఉపవీత ధారణ మాయాతి" అని పరినిష్ఠిత బ్రహ్మచర్యానన్తరమందే బ్రహ్మచారికి మన్త్రోచ్చారణార్హతతోగూడిన యజ్ఞసూత్ర ధారణము ప్రాప్తించగలదని యుండుటవలన అపరినిష్ఠితునకు వైదికవిధి వర్తింపదని తెలియుచున్నది. కావున వటుదీక్షా భోజనమునకు యజ్ఞసూత్ర ధారణ మనావశ్యకము.

ఈ సందర్భముల ననుసరించి సుదర్శనులచే ప్రవర్తింపజేయబడిన మతము యుక్తిసహముగాక ఆపస్తంబమత విరుద్ధమని కూడ తెలియు చున్నది. ఇక హరదత్త మతమును విచారించుదము.

## హరధత్తమత విమర్శనము

ఈయన ॥సూ॥ సోత్తరాచ్ఛాదనశ్చైవ యజ్ఞోపవీతీ భుఞ్జీత. (ఆప.ధ. ౨-౧౯-౧౨) అను సూత్రమునకు "ఉత్తరాచ్ఛాదన ముపరి వాసః తేన యజ్ఞోపవీతం కృత్వా భుఞ్జీత" అనగా వస్త్రముతో యజ్ఞోపవీతమును జేసికొని భుజించవలయును. అనియు "ప్రా గపవర్గా ణ్యుదగపవర్గాణి వా దైవాని కర్మాణి కరోతి"॥ (ఆప.శ్రౌ.ప. ౨-౧౫) అను సూత్రము నకు, 'యజ్ఞార్థ ముపవీతం యజ్ఞోపవీతం' 'అజినం వాసో వా'— ఇతి బ్రాహ్మణే వ్యాఖ్యాతం' అనగా బ్రాహ్మణమున విధింపబడిన అజినోత్తరీయ ములతో, యజ్ఞోపవీతియై దైవకర్మల జేయువలయుననియును, 'ఉపాసనే

గురూణాం' అనుసూత్రమునకు 'వాసో విన్యాస విశేషో యజ్ఞోపవీతమ్' అనగా నుత్తరీయము కుడిచేతి క్రిందుగ నెడమ భుజముమీదికి కప్పుకొనుట యజ్ఞోపవీతమనియు 'యజ్ఞోపవీతీ ద్వివస్త్రః' యదా ద్వివస్త్రః తదా వాససాన్యతరేణ యజ్ఞోపవీతీ స్యాత్" — ఆప.ధ. ౧-౬-౧౮.

అనగా, రెండు వస్త్రములు గలవాడుగ నుండిన నొకదానిని కట్టుకొని రెండవదానితో నుపవీతిగా నుండవలయుననెడు వ్యాఖ్యానములచే అజినోత్తరవాసస్సులనే యజ్ఞోపవీతములుగ గ్రహించియు "అహత ముత్తరం వాసో ... ..." అను గృహ్యసూత్రమున "... ... యేన ఉపవీతం వా క్రియతే తదుత్తర మితి" అనియు, 'అపి వా సూత్రమేవోపవీతార్థే' భా॥ "అపి వా సూత్ర మేవ సర్వేషా ముపవీతకృత్యే భవతి న వాస ఏవ." ఆప.ధ. ౨-४-౨౨.

అనగా పక్షాన్తరమున అందఱకు సూత్ర ముపవీత స్థానాపన్నమైన దనియు వ్యాఖ్యానము జేసియు ఉపనయనమున అట్టి అజినోత్తర వాసస్సులకు మఱియొక కాలమును సూత్రకారుడు చూపుచుండ "స్నాతం కుమారం శుచి వాససం బద్ధ శిఖం యజ్ఞోపవీత మాపశ్యయతి." శ్రు॥ "యజ్ఞోపవీతం పరమం పవిత్రమితి." అ. ౫-౨.

అను బోధాయన గృహ్యము నుపపత్తిగా జూపి ఆపస్తంబుల కుపనయనాదియందు ప్రసక్తిలేని యజ్ఞసూత్రమును విధించి ప్రవర్తింపజేయుట ఆపస్తంబమత విరుద్ధము. ఇట్టి యజ్ఞసూత్ర మావశ్యకమైనయెడల ఆపస్తంబ మహర్షి 'బ్రాహ్మణాఙ్ భోజయిత్వా' అను సూత్రమున — యజ్ఞోపవీతం ధారయిత్వా — అను వాక్యమును గూర్చకపోడు.

అయినను బోధాయనుడు చెప్పినాడు గాన చేయవలెననుట యుక్తము గాదు. బోధాయనమతము తత్సూత్రీయుల కవశ్యానుష్ఠేయమనుటకు మాకెట్టి విప్రతిపత్తియు లేదు. గాని ఆపస్తంబాదులు చెప్పజాలని పరమార్థమును బోధాయనుడు గ్రహించెననుటగాని బోధాయనునిపై యాధారపడి ఆపస్తమ్బాదులు చెప్ప మానిరనుటగాని యుక్తిసహము గాదు. ఇట్లే ఉత్తరీయోపవీతత్వము నంగీకరించిన వైద్యనాథదీక్షితులును-

శ్లో॥ వినా యచ్ఛిఖయా కర్మ వినా యజ్ఞోపవీతతః,
రాక్షసం తద్ధి విజ్ఞేయం, సమస్తా విష్ఫలాః క్రియాః.

అని ఉపపత్తిని జూపి, మాణవకున కుపనయనాదిలో యజ్ఞసూత్రమును విధించుటయు సుదర్శనమతమువలె అయుక్తికమైనదేయని వేఱుగ జెప్ప నక్కఱలేదు.

## పురుషార్థ క్రత్వర్థోపవీతములు

ఇక బోధాయన యజ్ఞోపవీతద్వయమునుగుఱించి విచారింపవలసి యున్నది.

బోధాయనాపస్తమ్బుల కుపవీతవస్తు భేదము లేక పోయినప్పటికి విషయభేద మున్నది.

బోధాయన మహర్షి తన సూత్రస్థల కుపనయనాదిలో విధించిన ఉపవీతము పురుషార్థోపవీతము. అనంతరమున నజినరూపముగ విధించినది క్రత్వర్థోపవీతము. అట్లే స్నాతకమున పురుషార్థోపవీత మొకటి యుండ, రెండవదగు క్రత్వర్థోపవీతము(ఉత్తరీయము)ను విధించుచున్నాడు. అజినోత్తరీయములు కర్మాంగోపవీతములని బోధాయన మత యజ్ఞోపవీత ప్రకరణమున 'నిత్య ముత్తరం వాసః కర్తవ్యం పఞ్చ స్వేతేషు కర్మసు' బో.ధ. ౨-౩-౩౮.

ఇత్యాది సూత్రములచే దెలిసికొని యుంటిమి. పురుషార్థమన ధారణ మాత్రముచేతనే స్వతంత్రముగ సుకృతము వాపాదింప జేయునది. క్రత్వర్థమన కర్మానుష్ఠానమున కంగమై కర్మసాద్గుణ్య సంపాదకమగునది. ఇట్లు పురుషార్థోపవీతము, కర్మాంగోపవీతము లేక క్రత్వర్థోపవీతము అని ప్రవృత్తి నిమిత్తము వేఱువేఱుగా గల రెండుపవీతములు బోధాయనులకు ధార్యములు. ఆపస్తంబు లిట్టి యుపవీత ద్వయ విధానమును జేయలేదు. కావున ఆయన మతమున క్రత్వర్థ పురుషార్థోపవీతముల కొక్కటియే యుపవీత మను విషయము ముందు (పు.46) స్పష్టము గాగలదు.

## పురుషార్థ సూత్రము కర్మాంగము గాదు

ఇట్టి విధానము నాశయించియే యీ క్రింది వ్యాఖ్యానము ప్రవర్తించుచున్నది. పరాశర మాధవీయము యాజన ప్రకరణమున "సర్వథా వృత్తి బ్రాహ్మణానాం జీవనహేతు ర్యాజనం. తత్ర ఇతికర్తవ్యతా రూపేణ కృష్ణాజినవాససో రన్యతరేణోపవీతత్వం తైత్తిరీయారణ్యకే విధీయతే. యజ్ఞ సూత్రస్య పురుషార్థతైవోత్ప్రేక్షితుం శక్యతే" అని యున్నది. అనగా తా నొకరిని యజింపజేయునపుడు కృష్ణాజి నోత్తరీయములలో నొకదానితో నుప వీతియై యజింపజేయవలయును. యజ్ఞ సూత్రమునకు పురుషార్థత్వమే యూహింప శక్యమగుచున్నదని తాత్పర్యము.

ఆపస్తంబు లిట్టి యుపవీత ద్వయ విధానమును జేయక అజినోత్తర వాసో రూపోపవీతమును తత్స్థానమున తత్తుల్యప్రవృత్తి నిమిత్తముగల సూత్రోపవీతమును ధార్యములుగ విధించుటచే గౌణ ముఖ్య రూప ద్వయ మును పొందినను ఉపవీత ద్వయ మొక్కటియే యగుచున్నది.

## గమనించదగిన విషయము

ఇందువలన పైన వివరింపబడిన సూత్ర సంబంధమగు కేవల పురుషార్థత్వ మాత్రప్రయోజనము ఉపనయనాదియందు ధరించిన యజ్ఞసూత్రమునకే గల్గునుగాని ఆపస్తంబ విహితమైన 'అపి వా సూత్రమేవోపవీతార్థే' అను సూత్రముచే నుత్తరీయ స్థానమున ప్రాప్తించిన యజ్ఞ సూత్రమునకుగాని, బోధాయనవిహిత 'అజినం వాస స్సూత్రంవా ద్వితీయం యస్య యద్భవతి తేన స ఉపవ్యయతే' (బో.ప. ౨-౮-౧)

అను సూత్రముచే ప్రాప్తించిన అజినవాసస్థ్సానాపన్నసూత్రమునకు గాని, హరదత్త కుల్లూకభట్టులచే ప్రతినిధిగ వ్యాఖ్యానింపబడిన మనూపదిష్ట సూత్రమునకుగాని గలుగనేరదు. కలిగినచో ఆ సూత్రవిధానమునకు వైయర్థ్యము ప్రాప్తించగలదు. కనుకనే పితృయజ్ఞమున ఆ.ప. శ్రౌత సూత్ర భాష్యమున "వివస్య యజ్ఞోపవీతాని ప్రాచీనావీతాని కుర్వతే." ఆప. శ్రౌ. ౧౫-౧ ఖా "అథ సర్వే యజ్ఞోపవీతకృతానాం వాససాం సూత్రాణాం

వా గ్రన్థీః విస్రస్య, ప్రాచీనావీతాని కృత్వా, గ్రథ్నీయుః ... ... ..."
అనగ ఋత్విక్కులందఱు ఉపవీతములుగ జేయబడిన వస్త్రములయొక్క
గాని, యజ్ఞసూత్రములయొక్కగాని ముడులను విడదీసి ప్రాచీనావీతములుగ
గట్టుకొనవలయును. అను సూత్రపర వ్యాఖ్యానము యుక్తమగుచున్నది.
కావున పురుషార్థసూత్రము కర్మాంగము గాదు.

## గృహ్యకారోక్తి ప్రకాశనము

ఇక, ఉపనయనాదియందు సుదర్శన హరదత్తులచే నుదాహరింపబడిన సూత్రరూప యజ్ఞోపవీతమును మీరు ఆపస్తంబ మత విరుద్ధ మనుచుంటిరి. సంధ్యా భాష్యకారులగు కృష్ణపండితులు తన భాష్యమున యజ్ఞోపవీత ప్రసక్తియందు "ఉపనయన కాలే తస్య (ఉపవీతస్య) గృహ్యకారై రను క్తత్వాదితి చేత్సత్యం ... ..." "ఉపనయనప్రకరణేఽపి తద్వ్యాఖ్యానావసరే సుదర్శనాచార్యై రుపాసనే గురూణా మితి విహితం యజ్ఞోపవీతం ప్రాప్తం ఇతి వ్యాఖ్యాతమ్" అని ఆపస్తమ్బ గృహ్యకారునిచే యజ్ఞోపవీతమే చెప్పబడ లేదనియు, దానినెట్లో సుదర్శనులు తన భాష్యమున జూపిరనియు తన కా సుదర్శన మార్గమే దొఱకినదనియు విపుల వ్యాఖ్యాన మొనరించినారే! ఇది యేమి? అని ప్రశ్నింతురు.

వినుడు! ఇప్పటికి మీకు పూర్వగ్రంథ పఠనమువలన అజినోత్త రీయములు ముఖ్యములగు నుపవీతములని తెలిసియే యున్నది. ఈ విషయమును స్పష్టీకరించినది ఆపస్తంబ మహర్షియే యను విషయముగూడ మీకు దెలిసియేయున్నది.

కాని సంధ్యాభాష్యకారు లజినోత్తరీయోపవీతముల మఱచి తమ యాచా రమున అవిమర్శితముగ నుండి సుదర్శనార్యులచే ప్రవర్తింపజేయబడిన సూత్రోపవీతమును ప్రకృతముగ జేసికొని, సుదర్శనోక్తియందు తమ కాను కూల్యమును గల్పించుకొనిరి.

విచారింప, సుదర్శన హరదత్తులు బోధాయనులకువలె ఆపస్తంబుల కును పురుషార్థసూత్ర మనుకొనదగిన "యజ్ఞోప వీతకాల స్త్వ్య ద్వాచనే

కృత ఆశిషామ్" ఇత్యాది కపర్దికారికలచే ప్రవర్తించిన యజ్ఞోపవీతమునకై పాటుబడి దాని నెట్లో సాధించినను, అజిన వాసో రూప యజ్ఞోపవీతముల ప్రాముఖ్యమును ఆ యా స్థలముల జూపుచు వారిరువు రెచ్చటనైనను ఆపస్తంబ గృహ్యకారు లుపవీతమును జెప్పలేదని ప్రవర్తించలేదు. కావున సంధ్యాభాష్యకారోక్తి నిరాధారము.

మఱియు ఆపస్తమ్బ గృహ్యకారులేగాక, ఆశ్వలాయన, గోభిల, కాఠక, హిరణ్య కేశీయ, పారస్కర గృహ్యకారులుగూడ నుపనయన ప్రకరణముల యజ్ఞసూత్రమును విధింపక ముఖ్యోపవీతములగు అజినోత్తరీయములనే విధించిరి. కొందరు గృహ్యకారులు ప్రత్యేక స్థలముల యజ్ఞసూత్రమునుగూడ జూపిరి. వైదిక ధర్మప్రచారమునకు బద్ధకంకణులును శ్రుతి రహస్య ప్రకాశకులు నగు ఇట్టి గృహ్యకారులు సర్వ వైదిక కర్మానుష్ఠానమునకు మహోత్తమ సాధనమగు నుపవీతమును జెప్పక పోవుదురా? ప్రయోగమున ముఖ్యమును గ్రహింపవలసియుండ గౌణమునకు ప్రసక్తి యెట్లు? విచారింప వారి దృక్పథమున ఉపవీత క్రియాసాధన బోధకమగు 'అజినం వాసో వా'అను శ్రుతియే ప్రత్యక్ష మగుచున్నది. దాని ధారణమును 'మిత్రస్య చక్షుః' అను మొదలగు మంత్రములు ప్రతిపాదించినవి. కనుకనే బోధాయనులు పురుషార్థ సూత్రమును జెప్పినను క్రత్వర్థముగ నజిన వాసస్సులను తదభావమున సూత్రమును 'అజినం వాస స్సూత్రం వా ... ...' అని విధింపవలసి వచ్చెను. ఈ యర్థమునే టుప్టీకయందు భట్టపాదులును, అధ్వర మీమాంసా కుతూహల వృత్తియందు (పు.45) వాసుదేవ దీక్షితులును సమర్థించియుండిరి.

ఆనేకులు బోధాయనాదుల పురుషార్థ సూత్రమునుజూచి తదితర గృహ్యకారు లుపవీతమును జెప్పలేదనుట పొరబాటు. క్రత్వర్థ పురుషార్థతలు ప్రతినిధి సూత్రమునకును ప్రాప్తించగలవను విషయమును ముందు జెప్పగలము. గృహ్యధర్మానుక్రమమున గోభిల, కాఠక, పారస్కరులు యజ్ఞసూత్రధారణమును జెప్పకపోవుటవలన తద్వ్యాఖ్యాతలు ఆ గృహ్యకారు లుపవీతమును జెప్పలేదని వ్రాయుచు, దానిని మేఖలాబంధనానన్తరమునను, అజినధారణమునకు ముందును, తమ తమ యుక్తులచే ధరింపవలెనని వ్రాసిరి. పాఠక విశ్వా

సముకొఱకు (పు.34) పారస్కర భాష్య ముదాహరింపబడినది. సంస్కార దీపమును సంస్కార గణపతియు నిట్లే 'సూత్రానుక్తమపి సర్వభాష్యకార సమ్మతం ఉపవీతధారణ మస్మిన్నవసరే కర్తవ్యమ్' అని వ్రాసిరి. సాంఖ్యాయన గృహ్యమున అజినధారణానంతరమున యజ్ఞ సూత్రము వ్రాయబడి యుండెను. వారాహ సూత్రకారుడు మేఖలానంతరమున ఉపవీతమును పరిధానవస్త్రమును అజిన ధారణమును క్రమముగా వ్రాసెను. మానవ సూత్రకారుడు వరుసగా యజ్ఞసూత్రమేఖలాజిన ధారణములను విధించెను. వైఖానస గృహ్యము మేఖ. లోపవీత కృష్ణాజిన ధారణములను క్రమముగ విధించుచున్నది.

జైమినిసూత్రము క్రమముగా వసన యజ్ఞసూత్ర ... ... మేఖ లాజిన ధారణములను, కౌషీతకి సూత్రము మేఖలానంతరమున యజ్ఞ సూత్ర ధారణమును వ్రాసినవి. ద్రాహ్యాయణవృత్తి కారుడు ఖాదిరసూత్రవ్యాఖ్యాత "యజ్ఞోపవీతం" (౧-౪-౫) అను సూత్రమునకు నిత్యమైన దొకటి యుండ ఉపనయన ప్రసక్తి యందు మఱి యొకటి ప్రాప్తించినదనియు, యజ్ఞోపవీతము అజినక్రమముగా అమంత్రకముగా ధరింపవలయుననియు వ్యాఖ్యానములను జేసిరి. ఆశ్వలాయనసూత్ర ప్రయోగకర్తలు కొందఱు, పారస్కరాదులు· యజ్ఞసూత్ర ధారణమును అజినధారణానంతరమున 'ద్విజత్వ విప్త్యర్థ' మని సంకల్పించి ధరించుచున్నట్లు వారి వారి గ్రంథములలో కనుపించుచున్నది. అట్టి దానిని పురుషార్థమనుటలో సందేహ ముండదు. యజ్ఞసూత్రము నెవ రెట్లు విధించినను క్రతుపురుషార్థోభయార్థత్వము కుదురక పోదు.

ఇట్లుండ, విశేషజనులు పురుషార్థ కర్మాంగ సూత్రభేద జ్ఞానము లేకుండ యాగాదులుసైత మొనర్చుట తమ తమ వైదికకర్మలకు వైగుణ్యమును సంపాదించుకొనుటయే యనుటలో సందియ ముండదు.

## విఖన స్సూత్రము - మీమాంస్యము

కాని, వైఖానస సూత్ర విషయ మిచట కొంత ముచ్చటించవలసి యున్నది.

విఖనోఋషి గృహ్యకారు లందఱితోపాటు తానును తన గృహ్యసూత్రమున బ్రహ్మచారికి ఉత్తరీయమునుగా కృష్ణాజినమునే "... ... కృష్ణమృగస్యాజినమ్ ... ..." వై.గృ. ౨-౪-౨౩ అను సూత్రముచే విధించి "యా అకృన్త న్నితి వస్త్రం, ఇయం దురుక్తాదితి మేఖలాం పరీద మిత్యుత్తరీయం యజ్ఞోపవీత మిత్యుపవీతం, మిత్రస్య చక్షురితి కృష్ణాజినం తస్మై దదాతి." వై.గృ. ౫-౩౨ అను సూత్రముచే దాని ధారణమును విధించెను.

కాని, ఈ అజినోత్తరీయ ధారణ ముత్తరీయోపవీత ధారణముకంటె ననంతరమున కనుపించుచున్నది.

బ్రహ్మచారికి ఉత్తరీయాజినోత్తరీయములలో నజినోత్తరీయము శ్రుతి విహితమును ముఖ్యకల్పమును గాన గృహ్యకారు లందఱును నజినోత్తరీయ ధారణ కల్పమునే తమతమ గృహ్యసూత్రములలో జూపుచు అనుకల్పమగు నుత్తరీయ విధానమును జూపరైరి. అందునను ఈ సూత్రమున నను కల్పమగు నుత్తరీయమునకు ముఖ్యకల్పమునకువలె ప్రథమ విధానము, అనంతరమున పురుషార్థోపవీతవిధానము తదనంతరమున ముఖ్యమగు నజిన విధానము యుక్తము గాదు. అందువలన నుత్తరీయ విధానము ప్రక్షిప్తమని తోచుచున్నది.

ఇందుకు పూర్వోత్తర గ్రంథమును పరామర్శింప—

"త త్రాగ్నే ర్వాయవ్యా ముపవీ తాజిన మేఖలాఽహతవస్త్ర ... ... సంభారాన్ దర్భేషు సంభృత్య ... ... ప్రోక్షయతి" వై. గృ. ౨-౫-౩౦ "మేఖలోపవీతాజిన దణ్డధారీ ... ..." (వై.గృ.౮-౨-౧౫) అను సూత్రములందున ఉపనయన సంభార సంభరణోపవీతధార్య ద్రవ్యకథనములలో నుత్తరీయ ప్రసక్తియే కనుపింపదు.

వైఖానస ధర్మసూత్రమున్ను

"ఉపనీతో బ్రహ్మచారీ మేఖలోపవీతాజిన దణ్డధారీ ... ... వ్రతేవాధ్యయనం కరోతి." వై.ధ. ౧-౨-౧.

"నైష్ఠికః ... ... దణ్డీ సూత్రాజినధారీ ... ... భైక్ష భోజీ భవతి." వై.ధ. ౧-౩-౬.

అను సూత్రములచే నుత్తరీయమును విధించుట లేదు.

ఇదిగాక ఈ గృహ్యసూత్రభాష్యకర్త, యగు నృసింహ వాజపేయ యాజులు "వస్త్రం దదాతి తన్మంత్రం వాచయిత్వా ... ... మేఖలాం దదాతి ... ... ... ఉపవీతం దదాతి ... ... కృష్ణాజినం తస్మై కుమారాయ దదాతి. తన్మంత్రం వాచయిత్వో-పవీతవ ద్ధారయతి" అను భాష్యమున ఈ "పరీద మిత్యుత్తరీయ" మను వాక్యమును ప్రసక్తిలోకిగూడ రానీయరైరి. ఇదిగాక నారాయణభట్టకృత టిప్పణిగూడ "మేఖలా యజ్ఞోపవీత కృష్ణాజినేష్వపి మన్త్రవాచనమ్" అని ఉత్తరీయపు జోక్యమునే కలిగించుకొనదు.

కావున ఈ "పరీద మిత్యుత్తరీయమ్" అను వాక్యము ప్రక్షిప్తము కాకపోవు టెట్లు? అని అనుకొనెదమా? పారాయణవ్రతములలో నీ వాజపేయ వ్యాఖ్యానమున "ధాతాది పూర్వం ... ... పూర్వాదీని సూత్ర దండాదీ న్యప్సు విసృజ్య ... ... ..." వై.గృ. ౨-౮-౫౬.

అను సూత్రమున "... ... ఆదిశబ్దేన వస్త్రమేఖ లోత్తరీయ కృష్ణాజినా న్యపి గృహ్యన్తే" అనియు సమావర్తన ప్రకరణమున ... ... ... ఉదుత్తమ మిత్యుత్తరీయం ... ... ..." వై.గృ. ౨-౧౩-౧౩౩ అనియు, బ్రహ్మచారికి ఉత్తరీయ విసర్జనము కనుపించుచున్నది. దీక్షితీయ వ్యాఖ్యానము "అజినం వాసో వా" అను శ్రుతియందలి వా శబ్దము సముచ్చయార్థకము గాన నుత్తరీయ సూత్రాజినముల ధరించవలయునని నుడువుచున్నది. కావున ఈ విషయమున ప్రత్యేక మీమాంస యుక్తమని వదలివేయుచున్నాను.

## పారస్కరసూత్ర ప్రతికృతి

అత్ర యద్యపి యజ్ఞోపవీతధారణం న సూత్రితమ్. తథాపి 'ఏక వస్త్రాః ప్రాచీనావీతిన ఇతి ప్రేతోదకదానే ప్రాచీనావీతిత్వ విధానాత్' 'దండాజినోపవీ తాని మేఖలాంచైవ ధారయేత్' ఇతి యాజ్ఞవల్క్యేన బ్రహ్మచారిణః ఉపవీత ధారణ స్మరణాత్ తథా 'సదోపవీతినా భావ్యం ... ... ... న తత్కృతమ్' ఇతి ఛన్దోగ పరిశిష్టే కాత్యాయనేవ సామాన్యతః సర్వాశ్రమిణాం సదా

యజ్ఞోపవీత ధారణ స్మరణాచ్చ, యజ్ఞోపవీత ధారణం తావ దుపనయన ప్రభృతి ప్రాప్తమ్. తచ్చ కుత్ర కర్తవ్య మిత్యపసరాపేక్షాయాం ఔచిత్యా న్మేఖలాబన్ధ నానన్తరం యుజ్యతే. ఏతదేవ కర్కోపాధ్యాయ వాసుదేవ దీక్షిత, రేణు దీక్షిత ప్రభృతయ స్స్వస్వగ్రన్థేషు యజ్ఞోపవీత ధారణ మన్త్రావసరే లిఖితవన్తః తచ్చ సర్వకర్మాఙ్గత్వా న్మన్త్రవ దుచ్యతే. ఇతి మన్త్రమపి శాఖాన్తరీయం లిఖితవన్తః తతోఽత్ర "యజ్ఞోపవీతం ... ... ... ... తేజః" ఇతి మాణవక పఠితేన మన్త్రేణ ఉపవీతం పరిధాపయతి ఆచామయతి అథ తూష్ణీ మైణేయ మజిన ముత్తరీయం కరోతి (ఇతి).

## సూత్ర ప్రాధాన్యవాదము

మీరు శాస్త్రీయములైనను సదాచరణములో లేని మార్గములను జూపిన చూపవచ్చును. మీరు చూపునట్టి మార్గము క్రొత్తదిగ హృదయ-మును కలవరపెట్టుచున్నది.

1. వినుడు! 'ప్రాగపవర్గా ణ్యుదగపవర్గాణి వా యజ్ఞోపవీతీ ప్రదక్షిణం దైవాని కర్మాణి కరోతి' — ఆప.శ్రౌ.ప. ౨-౧౫.

అను సూత్రమందలి 'యజ్ఞోపవీతీ' అనుపదమునకు భాష్యకర్తయగు కపర్దిస్వామి "దక్షిణస్య బాహో రధస్తా త్సవ్యస్య బాహో రుపరి న్యస్తం కార్పాసం సూత్రం యస్య సః యజ్ఞోపవీతీ" అని కుడిచేతి క్రిందుగ వెడమభుజము మీదుగ నుండు, ప్రత్తితో నిర్మింపబడిన దారముగల వాడు — అని వ్యాఖ్యానము జేసియున్నాడు.

2. గోభిల సూత్రకారుడు 'యజ్ఞోపవీతం కురుతే సూత్రం వస్త్రం వాఽపి వా కుశ రజ్జుమేవ — గో.గృ. ౧-౨-౧.

అని, యజ్ఞసూత్రమును, వస్త్రమును, దర్భత్రాటిని, ఉపవీతద్రవ్యము లుగ విధించుటలో ప్రథమమైన దానివిగ సూత్రమునే నిర్దేశించెను.

3. వైదిక సార్వభౌముడను బిరుదముగల గృహ్యరత్న కంఠభూషణ కారుడు, 'అజినం వాసో వా దక్షిణత ఉపవీయ' ఇతి వాసో విన్యాస స్యోపవీతత్వం యద్యపి శ్రూయతే. తథాపి 'సూత్రం నవం వై త్రివృత్' 'ఇతి

త్రివృత్సూత్ర స్యోపవీతత్వ శ్రవణా దాచారాచ్చ. సూత్రమేవ ధార్యమ్' అనగా నజిన వాసస్సులు శ్రుతియం దుపవీత ద్రవ్యములుగ విధింపబడినప్పటికి 'సూత్రం నవం వై త్రివృత్' అను శ్రుతి సూత్రరూప యజ్ఞోపవీతమును విధించుచున్న దగుటవలనను ఆచారము ననుసరించియు సూత్రమే యజ్ఞో-పవీతమని సిద్ధాన్తీకరించుచున్నాడు. ఇట్టి సూత్రప్రాధాన్యమునకు గతియేమి?

4. శ్రు॥ "కథ మయజ్ఞోపవీతీ బ్రాహ్మణః" అను శ్రుతియు,

శ్లో॥ నామ్నైవ తే వరద వాఞ్ఛిత దాతృభావం
వ్యాఖ్యాత్యతో న వహసే వరదాన ముద్రామ్,
విశ్వప్రసిద్ధతర విప్రకుల ప్రసూతే
ర్యజ్ఞోపవీత వహనం న హిఖల్వపేక్ష్యమ్.

అను వరదరాజ స్తవమందలి అప్పయ్య దీక్షితులవారి శ్లోకము స్మృతి పథమున బ్రవేశించినపుడును యజ్ఞసూత్రమే ఉపస్థితమగుచున్నది.

5. సన్న్యాసులు సైతము శిఖా యజ్ఞోపవీతములను వదలెద రనిన జుట్టును జందెమును వదలుచున్నారు. కాని అపుడు మీరు చెప్పునట్టి అజినోత్తరీయములు స్మృతికిగూడ రావు. ఎందరెందరో శిష్టులు ఎంతయో కాలమునుండి యజ్ఞసూత్రముతోనే సర్వవైదిక కృత్యము లొనరించుచున్నారు. ఇక మీరు వైదిక కర్మలు ముఖ్యోపవీతముల సహాత్యము(కలయిక)తోనే జేసిన విశేషమున్న దనెడు ప్రమాణవచనములను జూపిననే మాకు సదాచార మిది యను ప్రామాణ్యబుద్ధి కల్గును గాని లేకున్న గలుగనేరదు — అని మీరు ప్రశ్నింతురు.

## ఏతన్నిరాకరణము

### వినుడు!

1. ఆపస్తంబ శ్రౌత పరిభాషయందు కపర్దిస్వామి — 'యజ్ఞోపవీతీ' యన ప్రత్తితో నిర్మింపబడిన దారము గలవాడని భాష్యము జేసినది సత్యమే కాని, ఆ సూత్రమందలి ఆ పదమునకు హరదత్తాచార్యులు 'అజినం

వాసో వా' ఇతి బ్రాహ్మణే వ్యాఖ్యాతం' అని. అజినముగాని వస్త్రముగాని ఉపవీతముగ గలవాడని వ్యాఖ్యానము జేసియున్నా రనునది పాఠకులకు దెలిపినదే. ఈ విషయమున కపర్దిస్వామి అభిప్రాయమును దెలిపికొనలేము. ఆయన కొక నమస్కారము.

2. గోభిల గృహ్యకారుడు ఉపనయనమునను స్నాతకమునను అజినోత్తరీయములను మాత్రమే విధించి, యజ్ఞసూత్రమును విధించక "యజ్ఞోపవీతం కురుతే ... ... ... మేవ" ౧-౨-౧ అని ప్రత్యేకస్థలమున ఉపవీత ద్రవ్యవిధాయక సూత్రమును నిర్మించెను. ఈ సూత్రము "వాససా యజ్ఞోపవీతం కురుతే. తదభావే త్రివృతా సూత్రేణ కుశ బాల ముఞ్జ ప్రతిసర రజ్జుభి ర్వా" (అనగా వస్త్ర ముపవీతము), అది లేనపుడు ప్రత్తిదారము, దర్భ, గోవాలము, ముఞ్జ (తృణ విశేషములు), (కడిలవార త్రాళ్లు) ఉపవీతములు అను నిగమ పరిశిష్టపు ద్రవ్య విధాయక వచనము వంటిది. వస్త్రప్రాధాన్య బోధకములగు ఉపవీత ద్రవ్యవిధాయక వచనములు పెక్కులు గలవు. కాని, గోభిలాచార్యుడు 'యజ్ఞోపవీతం కురుతే' అను సూత్రమున యజ్ఞసూత్రమును ప్రథమముగ నిర్దేశించెను. అయినను తైత్తిరీయారణ్యకశ్రుతులయొక్కయు నిగమ పరిశిష్టాపస్తంబాది బహుతర స్మృతులయొక్కయు ప్రామాణ్యమువలన 'పాఠక్రమా దర్థక్రమో బలీయాః' అను న్యాయము ననుసరించి వస్త్ర శబ్దమును పూర్వపతితమైన దానినిగా గ్రహించవలయును. పై దగు శ్రుతిస్మృతి ప్రామాణ్యమును ఈ సూత్రమందలి దుర్బలమగు పాఠక్రమము బాధింపజాలదు. కావున నీ సూత్రమునకు సూత్రప్రాధాన్య వ్యాఖ్యానము యుక్తమైనది గాదు. అట్లుగాకున్న గోభిలసూత్రకారుడుపనయన స్నాతకములలో ప్రధానోపవీతములగు అజినోత్తరీయములను జెప్పియున్నాడు. కావున ముందువ్రాయబడబోవు (పు.48) ఉత్తరీయ వ్యాఖ్యానములోని జాతుకర్ణ్యవచనము ననుసరించి వస్త్ర శబ్దమునకు వస్త్రచీరము (గుండ్రముగ కుట్టబడిన గుడ్డ పేలిక)ను అర్థముగ జేసికొని యజ్ఞోపవీత గౌణద్రవ్యములగు సూత్రము, వస్త్రచీరము, దర్భత్రాడు—వీనిలో సూత్రము ప్రధానమైనదని చెప్పుట సర్వస్మృతి వ్యాఖ్యాన సమ్మతము. గౌణములగు

సూత్ర కుశ రజ్జువులకు మధ్యనున్న వస్త్రశబ్దమునకు వస్త్రచీరము (గుడ్డ పేలిక)ను అర్థముచెప్పుటలో అనౌచిత్య మేమియు లేదు. లేక యీ సూత్రము పురుషార్థోపవీత విధాయక మనుటలోను బాధ కనుపించదు.

3. గృహ్యారత్నకంఠభూషణము విచారింప పాంచరాత్రాగమ మత స్థులకు సంబంధించినది. ఆ కారణమున మన కది ఇచ్చట విమర్శ కనావశ్యకమే యైనను దీని కర్త వైదిక సార్వభౌమ బిరుదము గలవాడు కావున విమర్శింపక తప్పనిదగుచున్నది. ఈయన "ప్రసృతో హ వై యజ్ఞో పవీతినో యజ్ఞోఽప్రసృతోఽనుపవీతినః" అనుశ్రుతి యందలి ప్రసృతా ప్రసృతశబ్దములకు,

"ప్రసృతః=సృ గతౌ - ఉద్గతః ప్రవృత్త ఇత్యర్థః (జరిగినది), అప్ర సృతః=అనుద్గతః" అని వ్యాఖ్యానముజేయుట యుక్తతమ విషయమేగాని, తైత్తిరీయారణ్యక శ్రుతులును, తద్భాష్యములును బహుతర స్మృతులును అచట మీమాంసిత విషయములును, గృహ్యకారులును అజినోత్తరీయము లకు ప్రాధాన్యమును తత్స్థానాపన్న సూత్రమునకు గౌణతను చూపుచుండ అతి సాహసముతో యద్యపీత్యాది వచనములచే వేద విహితములగు అజి నోత్తరీయములను యజ్ఞోపవీతములుగ గ్రహింపక పై పెచ్చు ఆపస్తంబు లుపవీతమును జెప్పలే దనుచు సూత్రమునే ప్రధానోపవీతముగ గ్రహించుట జూడ నది ఈయన వైదిక సార్వభౌమతకు బదులు అవైదిక సార్వభౌమతను వెల్లడి చేయుచున్నది.

ఇది గాక వైద్యనాథ దీక్షితులు తొమ్మిది పేటలు గల దానిని 'త్రివృత్' అని చెప్పుటలో 'నవ వై త్రివృత్' అను శ్రుతిని ప్రమాణముగ నిచ్చుచుండ ఈయనకు ఆ శ్రుతిగాక "సూత్రం నవం వై త్రివృత్" అనుశ్రుతి శ్రుతికి శ్రుతమై సూత్రరూప యజ్ఞోపవీతమును ప్రధానమైన దానినిగ సిద్ధాన్తీ-కరింప జేయుచున్నది. ఈ శ్రవణము వారి సుకృతము ననుసరించి సర్వజన శ్లాఘ్యతమ విషయమే యైనను ఏతచ్ఛ్రుతి ప్రతిపాదిత సూత్రరూప యజ్ఞో-పవీతమును మాత్రము పూర్వగ్రన్థ పర్యాలోచనము వలన గౌణమే యనక తప్పదు.

4. 'కథ మయజ్ఞోపవీతీ బ్రాహ్మణః' అను శ్రుతికిని, అప్పయ్య దీక్షితులవారి వచనమునకును కేవల పురుషార్థ సూత్రమైనను, క్రత్వర్థ సూత్రమైనను, ఉభయార్థ సూత్రమైనను లక్ష్యము కావచ్చును. అంత మాత్రమున అలసత్వముచే నైన యాచారమునకే ప్రామాణ్యమిచ్చి శ్రుతి ప్రతిపాదిత ముఖ్యమార్గముల వదలి గౌణమార్గముల వర్తింపరాదు. తమ తమ గృహ్యాకారధర్మముల వదలి ఇతర గృహ్యాకార మత మనుష్ఠింపరాదు. ఇందుకు ధర్మశాస్త్ర వచనము లిట్లు బోధించుచున్నవి.

శ్లో॥ ప్రభుః ప్రథమకల్పస్య యోఽనుకల్పేన వర్తతే,
స నాప్నోతి ఫలం తస్య పరత్రేతి శ్రుతి స్మృతిః.

తా॥ అనగ ముఖ్య ధర్మాచరణమునకు సమర్థుడైయుండియు గౌణ ధర్మ మనుష్ఠించువానికి పరలోక సౌఖ్యము లేదని శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.

శ్లో॥ బహ్వల్పంవా స్వగృహ్యోక్తం యస్య యత్కర్మ చోదితమ్,
తస్య తావతి శాస్త్రార్థే కృతే సర్వః కృతో భవేత్.

తా॥ అనగా తమ గృహ్యాకారులు కొంచెము చెప్పినను గొప్పగ చెప్పినను దాని ననుష్ఠించిన మాత్రమున నంతయు జేసిన ఫలము ప్రాప్త మగుచున్నది. కావున గృహ్యాకారానుమతమగు ముఖ్యకల్పము ననుష్ఠానము లోనికి దెచ్చుకొనవలయును.

కావున వైదిక ధర్మాసక్తులు తాము చేయు కర్మలను తమతమ గృహ్యాకారోక్తి ననుసరించి సవిమర్శముగ జేసికొని కృతార్థత నొందవలయును.

## భగవత్పాద ప్రామాణ్యము

5. ఇక సన్న్యాసులు యజ్ఞసూత్రమునే వదులుచున్నారు? అను ప్రశ్నకు సమాధాన మీయబడుచున్నది.

విశ్వేశ్వర సరస్వతీ కృత యతిధర్మసంగ్రహమున—

"తతో యజ్ఞోపవీతం హస్తే కృత్వా ... ... ..."అని

సన్న్యసించువానికి సూత్రోపవీత త్యాగవిధియు లోకమున నట్టి యాచరణమును ఉన్నమాట సత్యమే కాని, ఆ సూత్రోపవీత ముత్తరీయ ప్రతినిధి కాగూడదను మాట యెచ్చటను లేదు గాన నదియైన గావచ్చును. లేక బోధాయనానుగృహీత పురుషార్థ సూత్రమైనను గావచ్చును. ఏది యైనను పై వచనార్థమునకు విప్రతిపత్తి లేదు.

ఈ విషయమున శ్రీ శంకర భగవత్పాదులు, బృహదారణ్యక (౩-౫-౧) భాష్యమున ఏషణాత్రయ పరిత్యాగ శ్రుతి వ్యాఖ్యానావసరమున సర్వకర్మ, కర్మ సాధన పరిత్యాగమును ప్రతిపాదించుచు-

యజ్ఞోపవీత ప్రసక్తియందు ఈ గ్రన్థమునకు మూలము లైన "నివీతం మనుష్యాణామ్" అను శ్రుతిని "యజ్ఞోపవీత్యేవాధీయీత" అను తైత్తిరీయారణ్యకశ్రుతిని ప్రమాణముగ జేయుటవలన నుత్తరీయోపవీతమునకు తత్ప్రతినిధి సూత్రమునకు త్యాగము వ్యక్తమగుచూ ఉత్తరీయోపవీత ప్రాధాన్యము సిద్ధాన్తిత మగుచున్నది.

ఇది యంతయు గాక కల్పసూత్రకారుడగు బోధాయన మహర్షియు "... ... ... తస్య చౌలవ త్తూష్ణీం కేశానోఽస్య స్నాప్యాచ్ఛాద్యాలంకృత్యాదివ్యాభిముఖ స్తిష్ఠ న్నజినం వాసో వా ... ... సవ్యమితి యజ్ఞోపవీతమితి బ్రాహ్మణమ్." బో.గృ.శే. ౧౧-౩ 'యజ్ఞోపవీతిన మప ఆచమయ్య దేవయజన ముదానయతి' బో.గృ.శే. ౧౧-౪ అను సూత్రములచే నుపనయనాది యందు అజినమునే యుపవీతముగ ధరించవలయునని ఆచారాన్తరమును బోధించుచున్నాడు. ఇది యిట్టిది గావుననే ఆర్య ధర్మ ప్రత్యక్ష ఫలబోధినియందు మహా మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రులుగారు "ఊర్ధ్వ కాయమున వస్త్రము యజ్ఞోపవీతమువలె ... ... ... త్రై వర్ణికులకు యజ్ఞోపవీతము విహితమైనది. అది చర్మమైనను లేక వస్త్రమైనను నుష్ణగుణములు గలవియే గావున 'నిత్య యజ్ఞోపవీతీ' అని ధర్మములందును 'అజినం వాసో వా' అని శ్రుతియందును విధింపబడియెను" అని వ్రాయుచున్నారు.

ఈ విమర్శవలన సూత్ర ప్రాధాన్య వాదము నిరస్తమైనది.

## ఉత్తరీయోపవీత ప్రాధాన్య విరూపణము

శ్లో॥ ఏకమేవ యతే స్సూత్రం సాజినం బ్రహ్మచారిణః,
సోత్తరీయాణి గృహిణ స్తథైవ వనవాసినః.

శ్లో॥ సదోపవీతవ ద్ధార్యం వాస స్సకల కర్మసు,
సహయజ్ఞోపవీతేన బధ్నీయా చ్ఛ్రాద్ధకర్మణి. — (ధర్మప్రవృత్తి).

శ్లో॥ ఉపవీతం యథా యస్మిన్ ధత్తే కర్మణి వైదికే,
బ్రహ్మచారీ గృహస్థశ్చ తద్వ ద్వాసోఽపి ధారయేత్.

— (లఘ్వాశ్వలాయనస్మృతి).

(ఉత్తరీయం సమాఖ్యాతం వాసః కృష్ణాజినం శుభమ్)

— (గోభిల భాష్యము).

శ్లో॥ యథా యజ్ఞోపవీతం తు ధార్యతే చ ద్విజోత్తమైః,
తథా సంధార్యతే యత్నా దుత్తరాచ్ఛాదనం శుభమ్.

— (కృత్యసార సముచ్చయము).

వ్యా॥ ఉత్తరీయధారణంచ యజ్ఞోపవీతవత్. యథా ద్విజోత్తమై స్సవ్యాపసవ్యత్వాదినా ఉపవీతం ధార్యతే తథా ఉత్తరాచ్ఛాదనం సర్వైరేవ ధార్యమిత్యర్థః.

— (వీరమిత్రోదయము).

అనగా మనముచేయు సర్వకర్మలం దుపవీతమున ప్రసిద్ధితో నుండు యజ్ఞసూత్రముతో గూడ నజినమునో, ఉత్తరీయమునో ధరించవలయునని తాత్పర్యము.

ఇదిగాక వివాహోపనయనములందు మనము యజ్ఞ సూత్రముతోను అజినోత్తరీయములతోనే ఔపాస నాగ్నికార్య సంధ్యావందనాదులు జేయు

చున్నాము. అటులనే యెల్లప్పుడు వైదిక ధర్మముల ననుష్ఠించవలయునను నర్థము నీ క్రింది వచనములు ధ్రువము జేయుచున్నవి.

## ఉత్తరీయ ప్రాధాన్యోదాహరణము

తత శ్చీరోత్తరాసంగ సన్ధ్యా మన్వాస్య పశ్చిమామ్.

రామా.అయో.కా. స.౫౦-౪౮.

అనగా శ్రీరామచంద్రుడు నారతో నిర్మింపబడిన యుత్తరీయమును ధరించి సాయంసన్ధ్య నుపాసించెను.

ఇచట వాల్మీకి శ్రీరాముని సంధ్యావందనమం దుత్తరీయోపవీత ప్రాధాన్యమును వ్యక్తము చేయుచున్నాడు.

మఱియు పద్మపురాణము పాతాలఖండము ౧-౫౪వ శ్లోక మిట్లు చెప్పుచున్నది.

**శ్లో॥ హత్వా నీవారకాః భోక్తు ముపవిష్ట స్ప కానవే,**
**ఉపవీతాని దదృశే తేషాం సాజినకానిచ.**

తా॥ ఆకలిగొన్న భూరిద్యుమ్నుడను రాజు నివ్వరిధాన్యముల సేకరించుకొని వచ్చు నలుగురు బ్రాహ్మణులజంపి ఆ ధాన్యముల దినుటకు గూర్చుండి ఆ బ్రాహ్మణుల శరీరములందు అజినములతో గూడిన ఉపవీతముల జూచెను.

మహాశయులారా! చూచితిరా?

అజినవాసః ప్రాధాన్యమును! జాగ్రత.

## గౌణోపవీత మపరిత్యాజ్యము

ఇచట నొకప్రశ్న బయలుదేరుచున్నది! అది యేమన? ముఖ్యగౌణములగు వస్త్ర, సూత్రోపవీతముల సంభవమందు ముఖ్యమును గ్రహించి గౌణమును ఎందువలన వదలగూడదు? అని.

ఏనుడు, ఉత్తరీయమునకు ప్రమాదాదికమువల్లనైన అసంభవత్వాదికము ప్రాప్తించి దానివలన దోషములు ప్రాప్తించుననని యేతదర్థమై సూత్రము ధరింపబడుచున్నదను విషయము పూర్వమే వివరింపబడినది.

కావున అట్టిదానిని వదలిన పూర్వోక్తదోష ప్రాప్తి యుండక పోదు. కాన గౌణమగు నుత్తరీయార్థ సూత్రమును వదలగూడదు. ఇందుకు సముచ్చితి బోధకములగు వచనము లనేకము లుదాహరింపబడినవి.

ఇదిగాక ఈ విషయము సంస్కారదీపమం దీక్రింది విధమున వివా రింపబడియున్నది.

## సంస్కారదీపకాది విమర్శనము

"న చ తృతీయ (ఉపవీత) త్యాగాపత్తిః. సర్వార్థత్వేన ధృతత్వాత్. ఉత్తరీయస్య సర్వదా సత్వాసంభవాత్. ఇతి శిష్టాచారోఽప్యేవమ్." అనగ నుత్తరీయార్థము ధరించిన యజ్ఞసూత్ర ముత్తరీయోపవీతముతో జేయ దగిన సర్వకర్మలకొఱకు ధరింపబడినదగుటవలనను, ఉత్తరీయ మెల్లప్పుడు ధరించబడి యుండుట అసంభవము గనుకను తృతీయోపవీతము తీసివేయ దగినదిగాదు. శిష్టాచారము నిట్లే యుంటున్నదని తాత్పర్యము.

ఇందువలన ఆపస్తంబ ధర్మసూత్రమున గృహస్థ ప్రకరణమున గృహ స్థుకు నిత్యమైనదిగ నుపవీతము విధింపబడి, బ్రహ్మచారి ప్రకరణమున—

"ఉపాసనే గురూణాం ... ... ... స్యాత్" అను సూత్ర వ్యాఖ్యానమున హరదత్తులు "ఏతేషు కర్మసు యజ్ఞోపవీత విధానా త్కాలాన్తరే నావశ్యం భావః" అని సూత్రోక్తకర్మలందు దప్ప మిగిలిన సమియములందు బ్రహ్మచా రికి యజ్ఞోపవీత మక్కఱలేదను విషయము బ్రహ్మచారి మానుషకర్మలందు ధరింప వీలులేని అజినోపవీతపరముగాని ఆ యజినాసంభవత్వాది దోషనివా రణార్థమై ధరించబడిన యజ్ఞసూత్ర పరము గాదనునది స్పష్ట మగుచున్నది. అజినప్రతినిధి సూత్రమును నిత్యముగ ధరించవలయు ననుటను మను స్మృతి. "కార్పాస ముపవీతం స్యాత్ మేఖలా మజినం దణ్డ ముపవీతం కమణ్డలుమ్". అని విశదీకరించుచున్నది. స్మృతిముక్తాఫలము ననుప- నయన ప్రకరణమున "ఏతేషు కర్మసు యజ్ఞోపవీతవిధానా త్కాలాంతరే నావశ్యం భావ ఇతి కేచిత్ (హరదత్తాః) వ్యాచక్షతే. బహుస్మృతి విరోధాత్ శిష్టాచారవిరోధా త్తదనాదరణీయమేవేత్యన్యే" అనగా గురూ పాసనాది

కర్మలందు దప్ప మిగిలిన సమయములలో యజ్ఞోపవీత మనావశ్యక మని కొందఱును, అట్లనుట అనేక స్మృతులకు శిష్టాచారమునకు విరుద్ధమైన దగుటవలన ఆదరింపదగినది గాదని మఱి కొందఱు ననుచున్నారని చూప బడిన తాటస్థ్యము.

ప్రకరణ విచారణలేక చేయబడినదనుట యుక్తము. కావున ఉత్తరీ యార్థ సూత్రమును ప్రధానమగు నుత్తరీయ మున్నపుడును తీయగూడదు. సాహసించి తీయువారు యథోక్త ప్రాయశ్చిత్తార్హు లగుచున్నారు. మఱియు నీ సంస్కార దీపకమందు గల విశేషము లేమన? ఉత్తరీయార్థ సూత్ర ముత్త-రీయ మన్త్రిముతోనే ధరింపవలసియున్నప్పటికిని యజ్ఞోపీత మన్త్రిముతోనే ధరించవలయు ననియు, ఉత్తరీయార్థ సూత్రముతో వైదికకర్మ నారంభించిన పిమ్మట ఉత్తరీయము ప్రాప్తించినను కర్మ మధ్యయం దుత్తరీయమును ధరిం పగూడదనియు, కర్మారంభమున నుత్తరీయ ప్రాప్తియం దుత్తరీయమును ధరింపవలయుననియు పూ.మీ.అ.౬-పా.3 సూ.౧౬-౧౮ ప్రమాణముగ నీయబడినవి. మఱియు శిఖా యజ్ఞోపవీతాభావమున క్రతుపురుషార్థోభ యాపచార ప్రయుక్త ప్రాయశ్చిత్త ద్వయ ముండునని వ్రాయబడియున్నది.

ఇదిగాక, బోధాయనుల క్రతుపురుషార్థ సూత్రములకు వలె, యజ్ఞసూ త్రమునకు నవసూత్ర మనియు, సంస్థాన విశేషమనియు నామాంతరములతో ద్వైవిధ్యము నొప్పి, సంస్థాన విశేషమన కర్మాంగమైనదని మన్వాదిస్మృతులను ప్రమాణముగ జేయుచు ఇది శూద్రునకుగూడ నర్హమైనదైనను శూద్రుడు దీనికి బదు లుత్తరీయమును గూడ ధరించ వచ్చు ననియు, నవసూత్రమును నిత్యముగ ద్విజులు మాత్రమే ధరించవలయును గాని, శూద్రుడు ధరించ గూడదనియు, వ్రాసిన విషయములు మిక్కిలి సమంజసములై యున్నవి. కాని, ఈయన తా నుదాహరించిన నవసూత్ర సంస్థాన విశేష సూత్రములకు పై విధమున వేరు వేరు లక్షణముల జూపి పిమ్మట

శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తేచ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థే వస్త్రాభావే తదిష్యతే.

అను విశ్వామిత్ర వచనమును ప్రమాణముగ జేసికొని తాను జూపిన యజ్ఞసూత్రములకు విలక్షణములగు ఈ శ్లోకమందలి శ్రౌత స్మార్త నిమిత్తములగు రెండు యజ్ఞ సూత్రములకు నైక్యము ఘటింపజేయుట యుక్తము గాదు. మఱియు మనువును ప్రమాణముగ జేయుచు నీ శ్లోకమున ప్రతిపాదింపబడిన ఉత్తరీయార్థ సూత్రమును ధార్యమనుటలో మన్వాపస్తమ్బ బోధాయనా ద్యుపదిష్టమగు నుత్తరీయముయొక్కయును, తదర్థ సూత్రముయొక్కయు అపరిజ్ఞానమే కారణమని చెప్పదగియున్నది.

ఇదిగాక, ఈయన—

"శ్లో॥ సదోపవీతినా భావ్యం సదాబద్ధ శిఖేన చ,
విశిఖోఽవ్యుపవీతశ్చ యత్కరోతి న తత్కృతమ్.

(ద్విజుడు ఎల్లప్పుడు యజ్ఞోపవీతము గలిగి జుట్టును ముడివేసికొని యుండవలయును. జుట్టును జందెమును లేనివానిచే జేయబడిన వైదిక ధర్మము వ్యర్థము.) అను ఛందోగ పరిశిష్ట వచన ప్రామాణ్యముచే దధి ఖాదిరాది న్యాయము ననుసరించి యజ్ఞోపవీతమునకు క్రతుపురుషోభయా ర్థత్వమును జెప్పుటయు, ఆ యజ్ఞోపవీతము గల వాని కుభయ ధర్మలాభ ముండుటయు, లేనివానికి లేకుండుటయు యుక్తమేగాని, ఆ న్యాయము ఒక్క దధికి క్రతు పురుషోభయార్థత్వ సంపాదక మైనట్లు మన్వాపస్తమ్బ గోభిల హిరణ్యకేశియాదులచే విధింపబడిన ఒక్క యజ్ఞసూత్రమునకే యుభ యార్థత్వ సంపాదకమగును. కాని, తనచే నిరూపింపబడిన ప్రత్యేక ధర్మముగల యుపవీత త్రయమున కుభయార్థత్వ సంపాదకము గాదు ప్రతిసూత్రమున కుభయార్థత్వ సంపాదనములో ఔచిత్యమును గానరాదు. అధ్వర మీమాంసా కుతూహల వృత్తియును, బోధాయనోక్త యజ్ఞసూత్ర ద్వయ ధారణవిధి ననుసరించియే యొకదానికి క్రత్వర్థతను మఱియొక దానికి పురుషార్థతను అంగీకరించుచున్నది.

చూడుడు. అధ్వరమీమాంసా కుతూహలవృత్తిః, 3-४-3.

"ఉపవ్యయతే ఇత్యనువాదో విధిర్వేతి సంశయః. తత్ర 'నిత్యయజ్ఞోప వీతీ' ఇతి స్మృతిమూల శ్రుత్యా విహిత మేకం యజ్ఞోపవీతం పురుషార్థతయా

నిత్యధార్యమ్. 'యజ్ఞోపవీత్యేవాధీయీత యాజయే ద్యజేత' ఇతి తైత్తిరీ యశ్రుత్యా "యజ్ఞోపవీతీ దైవాని కర్మాణి కరోతి." ఇతి స్మృతిమూల శ్రుత్యాచ సర్వార్థతయా విహిత మన్య ద్యజ్ఞోపవీతమ్. తదేత త్పురుషార్థేన యజ్ఞోపవీతేన సముచ్చీయతే. క్రతుపురుషార్థతయా సంయోగభేదాత్. బోధా యనసూత్రే "నిత్యమిత్యాచార్యా స్సంప్రతిపన్నాః కథమేత దుచ్యతే" ఇతి కర్మసు 'నిత్యయజ్ఞోపవీతీ' ఇత్యేవ సిద్ధే పున స్తద్విధానం వ్యర్థమిత్యాక్షిప్య 'అజినం వాస స్సూత్రం వా ద్వితీయం యస్య యద్భవతి తేన స ఉపవ్యయతే' ఇతి సముచ్చయవచనాచ్చ. టుప్టీకావార్తికే 'యజ్ఞోపవీతేనోపవీతస్యావిరోధా త్సముచ్చయః. ఇతి వక్ష్యమాణత్వాచ్చ." అని చెప్పుచున్నది.

కావున నీ యుపవీత త్రయ విధానము, దధి ఖాదిరాది న్యాయము ననుసరించిన యీ యుపన్యాసమును వ్యర్థములు. సంస్కారదీప ప్రతికృతి యందు పు.55 ఉదాహరించబడినది.

## క్రత్వర్థ పురుషార్థతల కేక సూత్రము

ఆపస్తంబాది మతమున యజ్ఞసూత్రము చూడాకర్మయందు శిఖవలె నుపనయన స్నాతకములందు సంస్కృతములగు అజిన వాసస్ స్థానములను పొంది ప్రత్యేకముగ పురుషార్థతకొఱ కేర్పడనిదైనప్పటికి నిత్యమై యుండు-టచే పూర్వమీమాంసా శాస్త్రము ననుసరించి క్రత్వర్థ పురుషార్థతల సంపాదించుచున్నదనుటలో సందియము లేదు.

ఆచారేన్దు వీరమిత్రోదయాదులు సర్వకార్యములం దుత్తరీయ ముపవీతమువలె నుండవలయునని యంగీకరించుచున్నవి. నిత్యకామ్య యజ్ఞోపవీతముల బోధించుచున్నవి. "సదోపవీతినా ... ... న తత్కృతమ్" అను వచనము ననుసరించి యజ్ఞసూత్రమునకు పురుషార్థ క్రత్వర్థతల గల్పించుచున్నవి. ఈ కల్పనము పైన వివరింపబడిన ఆపస్తంబాది మతము ననుసరించినదైనచో, యజ్ఞసూత్రమున కుభయార్థతా సంపాదనములో విప్రతిపత్తి యుండదు.

ఇక, అజినోత్తరీయములను గుఱించి ప్రస్తావించెదను.

## అజిన శబ్దార్థము, ధారణవిధి, లక్షణములు

అజ=గతి క్షేపణయోః ఉ-ఇనచ్-అజినమ్ అమరకోశ సుధావ్యాఖ్య.

అజ్యతే-క్షిప్యతే-ఇత్యజినమ్. వేయబడునది (చర్మము) అ-కో-లిఙ్గాభట్టీయ వ్యాఖ్యానము.

అజినం త్వే వోత్తరం ధారయేత్. ఆ.ధ. ౧-3-30.

ఐణేయ మాజిన ముత్తరీయం బ్రాహ్మణస్య ... ... ... ఆజం, గవ్యంవా వైశ్యస్య, సర్వేషాం వా గవ్యమ్. పా.సూ.

శ్లో॥ ఉత్తరీయం సమాఖ్యాతం వాసః కృష్ణాజినం శుభమ్.

— గోభిలభాష్యము.

తా॥ బ్రహ్మచారి యుత్తరీయముగ నజినమును ధరించవలయును.

"హారిణ మైణేయం వా కృష్ణం బ్రాహ్మణస్య, రౌరవం రాజన్యస్య, బస్తాజినం వైశ్యస్య, ఆవికం సార్వవర్ణికమ్. ఆప.ధ. ౧-3-3, ౫. ౬,౮. సర్వేషాం కృష్ణాజినమ్ బో.గృ. ౫-౧ అనగా నల్లయిఱ్ఱి లేదా నల్ల ఆడులేడి, రురుమృగము (పచ్చని జంతువు), మేక వీనియొక్క చర్మములు క్రమముగా బ్రహ్మ క్షత్రియ వైశ్య వటువులకు ఉత్తరీయములగు చున్నవనియు, గొఱ్ఱె చర్మము గాని, నల్లయిఱ్ఱి చర్మముగాని, అన్నివర్ణములవారికి ఉత్తరీయముగ నుండదగినదనియు, గోచర్మము వైశ్యునకును, మిగిలిన వర్ణములవారికిగూడ నుత్తరీయముగ నుండదగినదనియు నా యా గృహ్యకారులు చెప్పచున్నారు.

అజినము ఉత్తరీయముగా ధరింపవలయునని చెప్పటవలన నవి కప్పకొనదగిన వెడల్పు పొడవు గల్గి యుండవలయునని మనకు దెలియుచునే యున్నది.

ఇందుకు-ఆశ్వలాయనమహర్షి "... ...వాససా సంవీత మైణేయేన వాఽజినేన బ్రాహ్మణం, రౌరవేణ క్షత్రియ, మాజేన వైశ్యమ్." ఆశ్వ.గృ. (౧-౧౯-౮) అని ఉపనయనసమయములలో బ్రాహ్మణాది వటువులు వస్త్రమునుగాని ఆ యా యజినములను గాని కప్పకొందురని స్పష్టీ

కరించుచున్నాడు. బ్రాహ్మణ వటువునకు కృష్ణాజిన ముత్తమమైనదని సర్వ గృహ్యాకార సమ్మతము.

## అజిన వికల్పము

కప్పుకొనదగిన అజినము ప్రాప్తించనప్పుడు శాకల మహర్షి —

శ్లో॥ "అఖణ్డం వా త్రిఖణ్డం వాఽష్టా చత్వారింశ దంగులమ్,
చతురఙ్గుల విస్తీర్ణం ధారయే దజినం సదా.

స్మృత్యన్తరమ్—

శ్లో॥ త్ర్యంగుళం తు బహిర్లోమ యద్వా స్యా చ్చతురంగుళమ్,
అజినం ధారయే ద్విప్ర శ్చతుర్వింశాష్టషోడశైః.

— అని చెప్పుచున్నారు. అనగా వటువి అంగులముతో మూడు గాని నాల్గుగాని అంగుళములు వెడల్పుగల్గి నలుబదియెనిమిది అంగుళములు పొడవు గల్గియుండు అఖండమగు అజినముగాని, లేదా ఇరువది నాలుగు, ఎనిమిది, పదునారు అంగుళముల, పొడవుగల మూడు ముక్కలతో గుండ్రముగ నుండునట్లు కుట్టబడిన అజినమునుగాని వెలుపల రోమములుగల దానినిగా సర్వవైదిక కృత్యములందు ధరింపవలయునని తాత్పర్యము.

కుట్టునపుడు ముక్కలయందు కొంచె మెక్కువగ దీసి కుట్టి దానిని నలుబది యెనిమిది అంగుళములు గలదానినిగ జేయవలయునని అభియుక్తులు చెప్పుచున్నారు.

## ఉత్తరీయశబ్దార్థము - విధి, లక్షణము - భేదములు

ఉత్తరస్మిః - దేహే భవమ్, (ఘః) పైదగు శరీరమందుందునది, ఉత్తరీయము. (పై పంచ-కండువ). నిత్య ముత్తరం వాసః కార్యమ్. ఆప.ధ.సూ. ౨-౪-౨౧

భా॥ "ఉపాసనే గురూణా మిత్యాదివా కేషుచి త్కాలేషు యజ్ఞోపవీతం విహితం. ఇహ తు ప్రకరణా ద్గృహస్థస్య నిత్య ముత్తరం వాసో ధార్య మిత్య-

చ్యతే" అనగా "ఉపాసనే గురూణామ్" అను సూత్రముచే బ్రహ్మచారులకు అజినోపవీత ధారణము కొన్ని సమయములందు విధించబడినది. ఈ ప్రకరణము ననుసరించి గృహస్థుకు నిత్యముగా ఉపవీతమగు నుత్తరీయము ధరింపదగినదని చెప్పబడు చున్నది. ఈ యంశమునే హిరణ్యకేశీయాదులును ప్రతిపాదించు చున్నవి.

ఇయ్యది ఆ యా గృహ్యాకారులచే స్నాతకమున సంస్కరింపబడి ధార్యముగ విధింపబడినదనియు, ఇదియే యజ్ఞోపవీత ద్రవ్యమనియు మనము తెలిసికొనియున్నాము.

## ఉత్తరీయ వికల్పము

ఇట్టి వస్త్రోత్తరీయాభావమందు సంస్కారగణపతియందు జాతుకర్ణ్యుడు—

శ్లో॥ అభావశ్చే ద్ద్వితీయస్య వస్త్ర చీరం తదా భవేత్,
ద్వ్యంగులం త్ర్యంగులంవాఽపి చతురంగుల మేవ వా,
సూత్రం వస్త్రాకృతిం కుర్యా త్తేన స్యాదుత్తరీయతా.

— అని వస్త్రోత్తరీయమునకు బదులు రెండు, మూడు, లేదా నాలుగు అంగుళముల వెడల్పుగల గుడ్డముక్కగాని, అంత వెడల్పు గలిగి దారములతో నిర్మింపబడిన వస్త్రాకారముగల దానిని (కాశీపట్ట సూత్రము) గాని ఉత్తరీయముగ ధరింపదగినదని ఆదేశించుచున్నాడు.

స్మృతి చంద్రికయు ఈ యర్థమునే అనువదించినది. ఈ జాతుకర్ణ్య వచనము శ్రుతిచే విధింపబడిన వస్త్రోపవీత స్థాపనకొఱకు కేర్పడిన వికల్పశాస్త్రము గాన యుక్తతమమనుటలో సందియములేదు.

## ద్వితీయోత్తరీయ వివాదము - తన్నిరాకరణము

విశేషమేమన! ఇచట సంస్కార గణపతి జాతుకర్ణ్య వచనము ననుసరించి ద్వితీయవస్త్రమన కట్టుకొన్నదిగాక, యుత్తరీయమనియే వ్యాఖ్యానము

చేయుచు దాని స్థానమున నీ వస్త్ర, చీరమునుగాని, సూత్రకృత ద్వ్యంగులాది వైశాల్యముగల వస్త్రమునుగాని, యజ్ఞసూత్రమునుగాని అంగీకరించుచున్నది. ఇది యంతయు విప్రతిపత్తిలేని విషయమని పాఠకులకు దెలిపినదే. కాని,

1.శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తే చ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థం వస్త్రాభావే చతుర్థకమ్.

— ఇతి మనుః.

అని మఱియొక యుత్తరీయ మున్నదనియు నది జీవత్పితృగజుని (తండ్రియు, అన్నయు నున్నవాని) చే ధరింపరానిదనియు,

2.శ్లో॥ "ఉత్తరీయం యోగపట్టం తర్జన్యాం రౌప్యధారణమ్,
న జీవత్పితృకై ర్ధార్యం జ్యేష్ఠే వా విద్యతే యది."

— అని స్మృతి సంగ్రహవచనము నుదాహరించుచున్నది.

బోధాయన ధర్మ వ్యాఖ్యాత ద్వితీయ వస్త్రము (ఉత్తరీయము) గాక మఱియొక యుత్తరీయము స్మృత్యంతరములచే స్నాతకమున ధరింప వలయు ననుచున్నాడని చదివియుంటిరి. కాని, దానిని జీవ త్పితృగజులకు నిషేధించుట లేదు.

ధర్మసింధ్వాది నిబంధనలు ద్వితీయవస్త్ర, ముత్తరీయమనియు, 'అది లేక భోజనము, దేవతార్చనము, బ్రాహ్మణపూజ, హోమము చేయగూడ' దని—

శ్లో॥ "ఏకవస్త్రో న భుఞ్జీత నకుర్యా ద్దేవతార్చనమ్,
న చార్చయే ద్ద్విజాన్ న్నాగ్నౌ కుర్యా దేవంవిధో నరః."

— అను వచనమును ప్రమాణముగ నిచ్చి, మూడవదిగ పైన జెప్పబడిన గుండ్రముగ కుట్టబడిన రెండు మొదలగు అంగుళములు వైశాల్యము గల వస్త్ర, చీరము (గుడ్డపేలిక) గాని లేక సూత్రకృతము (కాశీపట్టసూత్రము) గాని లేక యజ్ఞ సూత్రముగాని మఱియొక యుత్తరీయముగ నుండవలయు ననుచు, దీనిని జీవత్పితృగజులకు - నిషేధించుచున్నవి. జాతుకర్ణ్య మతమున ద్వితీయ (ఉత్తరీయ) వస్త్రార్థ మేర్పడిన చీరవస్త్రము

లేక సూత్రకృతము, ఈ పక్షమున స్వతంత్రమై మూడవ దగుచున్నది. దీనికొక వ్యవస్థ కనుపించుటలేదు. పైన ఉదాహరింపబడిన మొదటి వచనము మనుస్మృతియందు కనుపింపదు. కాని ఈ యర్థము నిచ్చు వచనాంతరములు స్మృత్యంతరములలో లేక పోలేదు. రెండవ వచనము నిబంధన గ్రంథములందు అనేకములగు మార్పులతో కనుపించుచున్నది. ఆపస్తంబాదులు ద్వితీయ (ఉత్తరీయ) వస్త్రార్థము యజ్ఞసూత్రమును విధించు చుండ ఈ గ్రంథములు మూడవ వస్త్రమునుగూడ నుత్తరీయమని వ్యవహ-రించుచు తత్ స్థానమున యజ్ఞసూత్రమును విధించుచున్నవి మరియు దీనిని ధరింపగూడ దనుచున్నవి. జీవత్పితృకుడు దరింపగూడదనిన నది పితృ కర్మ యోగ్యమైన దనియేగదా! ఇట్టి దానిని అజీవ త్పితృకుడు మాత్రము ఎల్లప్పుడును శుభకార్యముల యందు సయితము ధరించియుండు టెట్లో గోచరించదు.

ఇంతియగాక తైత్తిరీయసంహితారణ్యకశ్రుతులును, (పు.10-11లు) పితృయజ్ఞమున ఆపస్తమ్బ మహర్షియు (పు.26) పిత్రర్థమై ప్రత్యేకోత్తరీ యమును విధింపనివా రగుటవలన పితృకర్మ నిమిత్తమై ప్రత్యేకముగ నొక యుత్తరీయమును ధరింప గూడదా? — అని ఆశంకింప గూడదు.

ఏది యెట్టిదైనను ఉపనయన స్నాతకములయందు ధరింపబడు ఉత్తరీ యముల కంటెను, తత్ స్థానాపన్న సూత్రములకంటెను, పరాశర మాధవీయ మును, ఇందుదాహరింపబడిన ప్రసిద్ధ గృహ్య సూత్రకారులును, మఱియొక యుత్తరీయమును విధించని వా రగుటవలనను, ఆపస్తంబ గృహ్యసూత్ర వ్యాఖ్యాత యగు హరదత్తులు "అహత ముత్తరం వాసో రేవతీస్త్వేతి సమానమ్" అను సూత్రమందలి యుత్తరవాసశ్శబ్ద వ్యాఖ్యాన ప్రసంగమున "యేన కటిః ప్రచ్ఛాద్యతే తదన్తర మితి, యేన బహి ర్నీవి ప్రచ్ఛాదన ముపవీతం వా క్రియతే తదుత్తర మితి" దేనిచే మొల కప్పబడుచున్నదో అది ధోవతియనియు, దేనిచే కట్టుకొన్న వస్త్రపు ముడి వెలుపలిభాగము కప్పబడుచున్నదో, మఱియు నుపవీత క్రియ నిర్వర్తింపబడుచున్నదో అది యుత్తరీయమనియు, ధోవతి యుత్తరీయములకు లక్షణము జెప్పుచుండుట వలనను. అండపిళ్ళ వ్యాఖ్యాన మీ మార్గమునే యనుసరించుటవలనను,

ఉత్తరీయము మూడవ వస్త్రముగాక రెండవదనుటలో సందియము లేదు. పై సూత్రమునకు సుదర్శన వ్యాఖ్యాన మతిసాహసోపేతముగ నున్నది.

## అజినమంత్ర తాత్పర్యములు

మం॥ మిత్రస్య చక్షు ర్ధరుణం బలీయ స్తేజో యశస్వి స్థవిరగ్ం సమిద్ధమ్,
అనాహనస్యం వసనం జరిష్ణు పరీదం వాజ్యజినం దధేఽహమ్.

— ఆపస్తంబైకాగ్నికాండము.

తా॥ (అజినోత్తరీయము గలవాడు దీర్ఘాయుష్షు గల వాడై సూర్యుని యథార్థరూపమును దెలిసికొన గలడని శ్రుతులు చెప్పుచున్నవి). నేను అజినమును ధరించి సూర్యుని యథార్థరూపమును దెలిసికొనెదను. మఱియు నీ యజినము నాకు గొప్ప తేజస్సును, కీర్తిని, అభివృద్ధిని, కాంతిని గలిగించును. ఇంతియగాక నీ యజినము మోసగాండ్రు ధరించునదిగాక బ్రహ్మచర్యాది వ్రతములం దుండెడివారుమాత్రమే ఉత్తరీయముగా ధరించదగినది. అకాల మరణాదుల రానీయక దీర్ఘాయుష్షు నిచ్చునది, మఱియు అన్నసమృద్ధి గలుగజేయును గావున నిట్టి యజినమును నేను ధరించుచున్నాను.

## ఉత్తరీయమంత్ర తాత్పర్యములు

(మొదటిమంత్రమునకు మాత్రము)

మం॥ రేవతీ స్త్వావ్యక్ష్ణః కృత్తికా శ్చాకృన్తగ్స్త్వా ధియోఽవయు
న్నవగ్నా అవృ ఝ్ఞః ర్ధృహస్ర మన్తాగ్ం అభితో అయచ్ఛః.

మం॥ దేవీ ర్దేవాయ పరిధీ సవిత్రే మహ త్తదా సా మభవ
న్మహిత్వనమ్. — ఆప. ఏకాగ్ని కాండము.

తా॥ ఓ యుత్తరీయమా! నిన్ను రేవతీ దేవతలు నీవు మొదట ప్రత్తివిగా నున్నపుడు విడదీసిరి. పిమ్మట కృత్తికా దేవతలు నిన్ను దారముగ జేసిరి. ధీ దేవతలు నేసిరి. ఈ చెప్పబడిన దేవతలును, మఱికొంతమంది దేవతలును రెండు వైపుల కమ్మి దారముల నిచ్చిరి. పూర్వమొకప్పుడు

దేవతలు నిర్మించి యిచ్చిన వస్త్రమును సూర్యుడు ధరించుటవలన దేవతలకు మహిమ గలిగెను. నీవును ఆమహిమ గల దేవతలచేతనే నిర్మింపబడితివి. కావున నిన్ను నే నీ సమయమున ధరించుటవలన నాకు సకల శుభములు గలుగుచున్నవి.

## ఉత్తరీయ ధర్మవిశేషములు

ఇట్లు మంత్రపూతమగు నుత్తరీయమును అపసవ్యముగ ధరింపరాదు. రంగులతోను, చిరుగులతోను విపరీతరూపము గలదానిని గూడ ధరింపరాదని స్మృత్యర్థసారమందు శంఖలిఖితులు:-

(1) "నాపసవ్యం పరిదధ్యా న్నచ వికృతం వాసః" అని చెప్పుచున్నారు.

పారస్కర గృహ్యకారుడు. (2) "వాసశ్ఛత్రోపానహ శ్చాపూర్వాణి చేన్మన్త్రి॥" (౨-౩-౩౨) అని — క్రొత్తవైన వస్త్రము, గొడుగు, పాదుకలు (చెప్పులు మొ.) మంత్రములతో ధరించవలయునని చెప్పుచున్నాడు. ఈ రెండు ధర్మములు అజినోత్తరీయమునకును చెల్లుచున్నవి. మరికొన్ని ధర్మములు దీనిలో 28వ పేజీలో జెప్పబడినవి. ప్రేతకృత్యములం దుత్తరీయమును ధరింపరాదని ఆప.ధ.సూ. ౨-౧౫-౭ ను, నడుమునకు కట్టుకొనవలయునని, ఆశ్వ.గృ. ४-౨-౯ సూత్రమును జెప్పుచున్నవి.

బోధాయనులు ప్రాయశ్చిత్త ప్రకరణమున "ఏక వస్త్రతా కేశ శ్మశ్రు నఖ లోమ వాపనమ్ (౨-౩-౩౨) అని యుత్తరీయమును నిషేధించుచున్నాడు. బోధాయన పారస్కరులు అంతరీయో (ధోవతి) త్తరీయముల కేకవస్త్రము పనికి వచ్చు ననెదరు గాని ఆపస్తమ్బులు "అథో నివీత స్త్వేకవస్త్రః" (ఆప.ధ. ౧-౬-౧౯) భా॥ "యదా త్వేకవస్త్రో భవతి తదా అథో నివీత స్స్యాన్న తస్య దీర్ఘస్యా ప్యేకదేశే నోత్తరీయం కుర్యాత్" అనగా నొక వస్త్రమున్నపుడు దానిని కట్టు కొనవలయునేగాని అది పొడవుగనున్నను దాని యొక భాగము నుత్తరీయముగ ధరింపరాదు — అని నిషేధించుచున్నారు. ఇట్లుండ ఆపస్తంబులకు యజ్ఞదీక్షయందు పొడవగు నేకవస్త్రధారణమునకు మూలము మృగ్యమై యున్నది.

"నైకవస్త్రో వార్ద్రవాసా దైవాని కర్మా ణ్యనుసంచరేత్.

— బో.ధ. ౨-౪-౮

ఉత్తరీయము లేకయు, తడిబట్టలు కట్టుకొనియు దైవ సంబంధములగు పనులను జేయగూడదు.

"నోత్తరీయ మథః కుర్యా న్నోపర్యాధఃస్థ మమ్బరమ్"

— పరాశరస్మృతి.

ఉత్తరీయమును కట్టుగొన గూడదు. ధోవతిని పైన వేసికొన గూడదు.

శ్లో॥ అలాభే ధౌతవస్త్రస్య శాణ క్షౌమావికాని చ,
కుతపం యోగపట్టంచ ద్వివాసాస్తు న వై భవేత్.

— పరాశరస్మృతి.

ఉతకబడిన ఉత్తరీయము దొఱకనపుడు జనుపనార, అవిసెనారలతో నేయబడినవస్త్రములనుగాని, గొఱ్ఱెల మేకల రోమములతో నిర్మింపబడిన వానిలో నొకదానిని గాని, యోగపట్టము (పట్టుదారములతో నిర్మింపబడిన జందెమువంటి సూక్ష్మవస్త్రమును) గాని ధరించవలయును.

## దర్శపూర్ణమాసలం దుత్తరీయ ముపవీతము

ఈ యజిన వాసోరూపోపవీత విషయమై భాట్టదీపిక. అ.3.౪. యందు తత్ప్రణేతయగు ఖండదేవుడును, టీకాకారుడును, తైత్తిరీయారణ్యక శ్రుతిచే విధింపబడిన అజిన వాసస్సులును, తదభావమున స్మృతులచే విధింపబడిన తదర్థ సూత్రాదులును యజన యాజనాదులం దుపవీతములై యుండుటచే "ఉపవ్యయతే" అను పునరుపవీత విధాయక శ్రుతి ననుసరించి దర్శపూర్ణమాసలం దుత్తరీయమే యుపవీతముగ నుండవలయునని "విధిర్వా స్యా దపూర్వత్వాత్" అను మీమాంసా సూత్రమును ప్రమాణీకరించిరి. ఈ విషయమును విద్యారణ్యులును 'అజినం వాసో వా' అను శ్రుతి భాష్యము (పు.9)న ఉద్ఘాటించిరి. మఱియు 'నివీతం మనుష్యాణామ్' అను

శ్రుతిభాష్యమున 'అత్ర ప్రతీయమానం నివీతాదికం వాసో విషయం న తు త్రివృత్సూత్ర విషయమ్' అని సిద్ధాంతీకరించిరి. ఇట్లే ఆపస్తంబులును 'ఉపాసనే గురూణామ్' అను సూత్రముచే భోజనమం దుత్తరీయోప వీతమును విధించియు, ప్రాయశ్చిత్త ప్రకరణమున 'సోత్తరాచ్ఛాదనశ్చైవ యజ్ఞోపవీతీ భుఞ్జీత. ఆప.ధ.౨-౧౯-౧౨ భా॥ ఉత్తరాచ్ఛాదన ముపరివాసః తేన యజ్ఞోపవీతం కృత్వా భుఞ్జీత ... ... ...' అని ఉత్తరీయోపవీతముతోనే భుజించవలయునని ఆదేశించుచున్నారు.

## సంస్కారదీపక ప్రతికృతి

### సంస్కారదీపకే - ప్రథమభాగే

మహామహోపాధ్యాయ పండిత నిత్యానన్ద పర్వతీయ విరచితే (7 పృష్ఠే)-

ఉపవీతిత్వం బద్ధశిఖిత్వం చాధికారివిశేషణమ్

శ్లో॥ సదోపవీతినా భావ్యం సదాబద్ధశిఖేనచ ।
విశిఖోఽవ్యుపవీతశ్చ య త్కరోతి న తత్కృతమ్॥

ఇతి ఛన్దోగ పరిశిష్టే కాత్యాయన వచనాత్ అనేన హి దధి ఖాదిరాది వత్. ఉపవీతిత్వస్య బద్ధశిఖిత్వస్యచ క్రతుపురుషోఽభయార్థత్వ మవగమ్యతే. తేన విశిఖేన వ్యుపవీతినాచ కర్మణి క్రియమాణే కర్మణోఽపి వైగుణ్యం భవతి. ఏవంసతి క్రతుపురుషోభయార్థాపచార ప్రయుక్తం ప్రాయశ్చిత్తద్వయ మత్ర బోధ్యమ్. ఉపవీతం ద్విధా. నవసూత్రం సంస్థానవిశేషశ్చ, తత్రాద్యం శూద్రస్య నేత్యుక్తమ్. మితాక్షరాయా మన్యంతు శూద్రస్యాపి భవతి. ఉపవీతినా కర్మ కర్తవ్య మిత్యస్య సర్వక్రతుశేషత్వేన శూద్రస్యా ప్యదృష్టార్థే కర్మణి ఉపవీతిత్వావశ్యంభావాత్ ఉపవీతాది ఉత్తరీయవస్త్రేణాపీతి పారిజాత కల్పతరూ ... ... ... సంస్థానవిశేషోపవీతాది స్వరూపంతు మన్వాదితో బోద్ధవ్యమ్. నవసూత్రాత్మ కోపవీతస్య కంఠా దుత్తారణ నిషేధం ... ... విశ్వామిత్రః.

శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తేచ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థే వస్త్రాభావే తదిష్యతే- ఇతి.

యద్యపి తృతీయోపవీతధారణం ఉత్తరీయకార్యే విధానా దుత్తరీయ మన్త్రేణ ప్రతిభాతి. తథాపి. "మన్త్రేణైవ స్మృతం కర్మ కర్తవ్య" మిత్యభిధానాత్. ప్రకృతే చ మన్త్రేణోపవీతధారణస్యైవ స్మరణీయత్వాత్. ఉపవీతమన్త్రేణైవ యుక్తమ్. తృతీయ ముత్తరీయార్థే ఇత్యేతావతైవ అనుకల్పత్వే సిద్ధే 'వస్త్రాభావే' ఇత్యుక్తిః. ఉత్తరీయాభావే ఏవ అనుకల్పత్వార్థా. తేన తృతీయే ధృతే ఉత్తరీయలాభే తదపి ధార్యమితి కేచిద్. తన్నేత్యన్యే. ఏకస్యైవ కదాచి దనుకల్పత్వే ప్రాధాన్యే చ విరోధాత్.

వృద్ధా స్త్వాహుః. ఉత్తరీయస్య సర్వకర్మార్థత్వా త్ప్రతికర్మధారణానుపపత్తేః తదుపవీతవత్ సర్వార్థం సకృదేవ ధార్యమ్. ఏవం తృతీయోపవీతమపి తదంగీకారేణ కర్మవిశేషారంభోత్తరం ముఖ్యోత్తరీయ లాభేఽపి న తద్గ్రహణం షాష్ఠ (పూ.మీ.౬-౩-౧౪) న్యాయాత్. కర్మానారంభే తు తృతీయసత్త్వేఽపి ముఖ్య గ్రహణం షాష్ఠ పూ.మీ.(౬-౩-౧౬) న్యాయాత్ న చ తృతీయత్యాగాపత్తిః సర్వార్థత్వేన ధృతత్వాత్ ఉత్తరీయస్య చ సర్వదా సత్త్వాసంభవాత్ ఇతి శిష్టాచారోఽప్యేవమ్ ... ...!

ఇట్లు
శ్రీమద్భారద్వాజసగోత్ర పవిత్ర శ్రీకృష్ణవేణీ వేంకటప్పార్య
మనీషి ప్రథమ తనూజుండును, శ్రీరామకృష్ణ భగీరథ పండిత
ప్రవరాంతేవాసియు నగు శ్రీరామమూర్తిశాస్త్రిచే
సంగ్రథితమగు శ్రీయజ్ఞోపవీతతత్త్వదర్శనమునఁ
బ్రథమ ప్రకరణము.

# యజ్ఞోపవీత తత్త్వదర్శనము

## ద్వితీయ ప్రకరణము

## యజ్ఞ సూత్రము

ఇక యజ్ఞసూత్ర విషయము విచారించబడుచున్నది. యజ్ఞసూత్ర మపవీతస్థానమును పొంది తత్కార్యనిర్వాహకతచే నుపవీతమను రూఢిని జెందినది. దీనిని బ్రహ్మోపనిషత్తు—

మం॥ కర్మణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః,
తై స్సంధార్య మిదం సూత్రం క్రియాఙ్గం తద్ధి వై స్మృతమ్. ౧౬

— అని విధించుచున్నది. అనగా వేదోక్తాధికారము గల బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు యజ్ఞోపవీతమును ధరించవలయుననియు, ధరింపబడిన యజ్ఞోపవీతము వైదికకర్మకు సాధనమనియు తాత్పర్యము.

మఱియు దీనిని "నిత్య ముత్తరం వాసః కార్యమ్. అపి వా సూత్రమేవో పవీతార్థే (ధ. ౨-౪ సూ. ౨౧-౨౨) అని ఆపస్తంబులును, ఇట్లే హిరణ్యకే శీయులును, శబ్ద కల్పద్రుమమున "వాససా యజ్ఞోపవీతం కురుతే తదభావే త్రివృతా సూత్రేణ ... ... ..." అని నిగమ పరిశిష్టమును, "వీరమిత్రోద-యమున "కార్పాసం చోపవీతం సర్వేషామ్" అని పైఠీనసియు, "అపి వా వాససా యజ్ఞోపవీతం కుర్యా త్తదభావే త్రివృతా సూత్రేణ" అని ఋష్య శృంగుడును ఈ మొదలగువారు విధించుచున్నారు. అనగా నుత్తరీయ ముపవీతమనియు, నది లేనపుడు అందఱకు ప్రత్తిదారమే యుపవీతమనియు తాత్పర్యము.

### యజ్ఞసూత్ర ధారణఫలము

#### వీరమిత్రోదయమున ఆదిత్యపురాణము

శ్లో॥ క్షౌమజం వాఽథ కార్పాసం శణసూత్ర మథాపి వా,
దద్యా ద్యజ్ఞోపవీతం యో న తం హింసన్తి వాయసాః.

(వాయసాః = రాక్షసాః) అవిసెనార, ప్రత్తి, జనుపనారలతో నిర్మించిన యజ్ఞసూత్రమును ధరించిన మాత్రముననే రాక్షసబాధ యుండదనియు బోధాయన ధర్మసూత్రము "నిత్యోదకీ నిత్య యజ్ఞోపవీతీ ... ... ... న బ్రాహ్మణ శ్చ్యవతే బ్రహ్మలోకాత్." (ధ. ౨-౨-౧).

శ్లో॥ నిత్యం స్వాధ్యాయ శీలస్స్యా న్నిత్యం యజ్ఞోపవీతవాన్,
సత్యవాదీ జితక్రోధో బ్రహ్మభూయాయ కల్పతే.

— ఔశనస స్మృతి.

అని, యెల్లపుడు యజ్ఞోపవీతమును ధరించినవానికి శాశ్వతమైన బ్రహ్మలోక సుఖము, బ్రహ్మసాయుజ్యము నందుననియు, పురుషార్థ మహాఫలమును బోధించుచున్నవి.

ఇట్టి ప్రయోజనముగూడ నున్నందుననే బోధాయనాది ఋషులే గాక ఆగమ దీక్షలయందాగమములును, పురుషార్థ సూత్రమును విధించుచున్నవి.

ఆపస్తమ్బ హిరణ్యకేశీయాదులు పురుషార్థ మహాఫలమున్ను గలుగుట కొఱకే ఉత్తరీయ స్థానమున సూత్రమును విధించుచున్నారు.

కాబట్టి గృహ్యసూత్ర వ్యాఖ్యాత లనేకు లుపనయన ప్రకరణము లలో తమ తమ యుక్తులతో పురుషార్థసూత్ర ధారణము నవ్యవస్థితముగ వ్రాసినవారైనను, ఉత్తరీయ స్థానాపన్న సూత్రమును మాత్రము అజినధా రణానంతరముననే అనగా నుపనయనానన్తరమే ధరించవలయు ననునది నిస్సంశయము.

ఇందువలన కర్మానుష్ఠాన ప్రసక్తియం దుత్తరీయముకంటె యజ్ఞ సూత్రము గౌణమైనను ద్విజునకు మహోత్తమ లక్షణమే గాక మహోత్తమ ఫలదమగుచు నిత్యముగ ధరింపదగిన దనుట నిర్వివాదము.

ఇట్టి యజ్ఞోపవీతమును ధరించుటయందు "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అను మంత్రముతో ధరించవలయునని పూర్వోక్తమగు బోధాయనో-క్తియేగాక "యజ్ఞోపవీత మన్త్రేణ, వ్యాహృత్యా వా చ ధారయేత్" అని

స్మృతి ముక్తాఫలము (యజ్ఞోపవీత కుంతముచేనైనను, వ్యాహృతులతోనైనను ధరించవచ్చునని) చెప్పుచున్నది.

## యజ్ఞోపవీత మంత్రములు

గోభిల పారస్కరాది భాష్యములయందు మఱికొన్ని మంత్రములు కనుపించుచున్నవి. వాని నన్నిటి నిచట నుదాహరించెదను.

1.మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్, ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బల మస్తు తేజః. — (బ్రహ్మోపనిషత్).

2.మం॥ ఓంభూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యమ్. — (వ్యాహృతయః).

3.మం॥ యజ్ఞోపవీత మసి యజ్ఞస్య త్వోపవహ్యామి.

— (పారస్కర సూత్రము).

4.మం॥ యజ్ఞోపవీత మసి యజ్ఞస్య త్వోపవీతే నోపనహ్యామి.

— (గోభిల సాంఖ్యాయన సూత్రములు).

5.మం॥ యజ్ఞోపవీతే నోపవ్యయామి దీర్ఘాయుత్వాయ సుప్రజాస్త్వాయ సువీర్యాయ సర్వేషాం వేదానా మాధిపత్యాయ యశసే బ్రహ్మవర్చసాయ.

— (స్మృతి రత్నమాలయందు కౌషీతకి శ్రు).

## యజ్ఞోపవీత మంత్రార్థము

పై యైదుమంత్రములకు యథాలాభముగ సంస్కృత భాష్యముల జూపి పిమ్మట ఆంధ్రార్థమును వివరించెదను.

1.మం॥ యజ్ఞోపవీతం ... ... ... బల మస్తు తేజః.

భా॥ (హే ఆచార్య! ఇదం బ్రహ్మసూత్రం అహం) ప్రతిముఞ్చ= ప్రతిముఞ్చామి, ప్రతిపూర్వో ముఞ్చతి బంధనార్థః, పురుష వ్యత్యయ

శ్ఛాందసః, కింభూతం యజ్ఞోపవీతం, యజ్ఞేన=ప్రజాపతినా, యజ్ఞాయ=వేదోక్త కర్మాధికారాయ ఇతి వా, ఉపవీతం=ఉపరి స్కంధదేశే వీతం, పరిహితం= పరమం, పరఆత్మా=మీయతే=జ్ఞాయతే, తేన వాక్యోపదేశాత్ పవిత్రం, శోధకం, ప్రజాపతేః=బ్రహ్మణః, సహజం=సహోత్పన్నం స్వభావసిద్ధం వా, పుర స్తాత్= ప్రాగ్భవం. అతః ఇదం ఆయుషే హితం, ఆయుష్యం, అస్తు. అగ్ర్యం=ముఖ్యం, అనుపహతం. శుభ్రం=నిర్మలం, బలం=ధర్మసామర్థ్యదం, తేజః=ప్రభావదమ్. — *(పారస్కర గృహ్యభాష్యమ్).*

2.మం॥ ఓంభూః ... ... ... ...ఓగ్ంసత్యమ్.

భా॥ భూరితి భూలోకాభిమానినీ దేవతా "ఓ మి త్యంగీకృతౌ ఓం ప్రశ్నేఽఙ్గీకృతౌ" ఇతి కోశాత్. భూలోకాభిమానినీ దేవతా మత్కృత మాహ్నికం (యజ్ఞోపవీతధారణం) అఙ్గీకరో త్వితి తత్తల్లోకాభిమానిదేవతాయై స్వకృత మాహ్నికం సమర్పయన్ ప్రార్థయతీతి భావః.

— *(సంధ్యా భాష్యమ్).*

3.మం॥ యజ్ఞోపవీత మసి యజ్ఞస్యత్వోపనహ్యామి.

భా॥ యజ్ఞోపవీతం=బ్రహ్మసూత్రం, అసి=క్రత్వర్థం సృష్టం. అస్తి. అతః, హే! వటో! యజ్ఞస్య=క్రత్వర్థం, త్వా=త్వాం, (యజ్ఞోపవీతేన) ఉపనహ్యామి=బధ్నామి.

— *(పారస్కరగృహ్య భాష్యమ్).*

4.మం॥ యజ్ఞోపవీత మసి యజ్ఞస్య త్వోపవీతే నోపనహ్యామి.

భా॥ (హేఉపవీత!). త్వం యజ్ఞోపవీతం. తన్నామ అసి=భవసి. అతః, త్వా=త్వాం, యజ్ఞస్య=యజ్ఞసంబంధినా తృతీయార్థే షష్ఠీ, ఉపవీతేన= బ్రహ్మసూత్రేణ, ఉపనహ్యామి=పరిదధామి.

— *(గోభిలసాంఖ్యాయన గృహ్యసూత్రయోః).*

5.మం॥ యజ్ఞోపవీతే నోపవ్యయామి, దీర్ఘాయుత్వాయ సుప్రజాస్త్వాయ సువీర్యాయ సర్వేషాం వేదానా మాధిపత్యాయ యశసే బ్రహ్మవర్చసాయ. (న ర్తతే భాష్యం తథా స్యర్థ స్సుగమ ఏవ)

— *(సంస్కార రత్నమాలాయాం కౌషీతకి శిఖా).*

# యజ్ఞోపవీత మన్త్రార్థము (తెలుగు)

1.మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ... ... ... తేజః.

(ఇదం)=ఈ చెప్పబోవు విధానము గల బ్రహ్మసూత్రమును, అహం= నేను, ప్రతిముఞ్చ=కట్టుకొనుచున్నాను.

హే ఆచార్య! = ఓ ఆచార్యుడా!

యజ్ఞోపవీతం, యజ్ఞ=ప్రజాపతిచే, లేక, యజ్ఞ=వేదోక్తకర్మాధికారము కొఱకు, ఉపవీతం=భుజముపైన ధరించబడునదియు, పరమం=దీనిచే పర మాత్మ దెలియబడుచున్నది, అనగా నుపనయనమున నిది ధరించబడు చున్నది గాన నుపనయనకర్మవలన వేదాన్త మహావాక్యోపదేశమునకు అర్హత గల్గించుచున్నదని తాత్పర్యము.

పవిత్రం=పవిత్రముచేయునది, ప్రజాపతేః=బ్రహ్మదేవునకు, సహజం= తనతో కూడా పుట్టినదియు, లేక, స్వభావసిద్ధమైనదియు, పురస్తాత్=అ న్నిటికంటె ముందుపుట్టినది, (అతః) ఈ కారణమువలన, (ఇదం)=ఈ బ్రహ్మసూత్రము, ఆయుష్యం=ఆయుస్సుకొఱకు హితమైనది (ఆయుస్సును ఇచ్చునది), అగ్ర్యం=ముఖ్యమైనది, లేక, తెగిపోనిది, శుభ్రం=నిర్మలమైనది, బలం=ధర్మసామర్థ్యము నిచ్చునది, తేజః=మహిమను గూర్చునది, అస్తు = అగుగాక.

2.మం॥ ఓం భూః ... ... ... ఓగ్ం సత్యమ్.

ఓం భూః=భూలోకాభిమానిదేవత నేను చేయు యజ్ఞోపవీత ధారణము నంగీకరించు గాక! ఇట్లే మిగిలిన వ్యాహృతులకును అర్థమును ఊహించు కొనవలయును.

3.మం॥ యజ్ఞోపవీత మసి యజ్ఞస్యత్వోపవీతే నోపనహ్యామి.

యజ్ఞోపవీతం=బ్రహ్మసూత్రము, అసి=(యజ్ఞము కొఱకు సృష్టింపబ డినదై) ఉంటున్నది. (ఇందువలన ఓ బ్రహ్మచారీ!) యజ్ఞస్య=యజ్ఞము కొఱకు, త్వా=నిన్ను, యజ్ఞోపవీతేన=యజ్ఞోపవీతముతో, ఉపనహ్యామి=కట్టు చున్నాను.

4.మం॥ యజ్ఞోపవీతమసి ... ... ... ఉపనహ్యామి.

(హేఉపవీత!)=ఓ యజ్ఞోపవీతమా! త్వం=నీవు, యజ్ఞోపవీతం= యజ్ఞోపవీతమను పేరుగల దానవు, అసి=అగుచున్నావు. అతః=ఇందు వలన, త్వా=నిన్ను, యజ్ఞస్య=యజ్ఞసంబంధమైన, ఉపవీతేన=బ్రహ్మసూత్ర ముతో, ఉపనహ్యామి=ధరించుచున్నాను.

5.మం॥ యజ్ఞోపవీతే నోపవ్యయామి... ... ...బ్రహ్మ వర్చసాయ.

(అహం=నేను, ఆత్మానం=నన్నును), దీర్ఘాయుత్వాయ=గొప్ప ఆయు ష్యము కొఱకు, సుప్రజాస్త్వాయ=మంచి సంతానము కొఱకు, సర్వేషాం= సమస్తమైన, వేదానాం=వేదములకు, ఆధిపత్యాయ=అధిపతిత్వము కొఱకు — అనగా సంపూర్ణముగ నన్నివేదములు చదువుట కొఱకు, యశసే= కీర్తికొఱకు, బ్రహ్మవర్చసాయ=వేద విహిత కర్మానుష్ఠానమువలన గలుగు తేజస్సుకొఱకు, యజ్ఞోపవీతేన=యజ్ఞోపవీతముతో, ఉపనహ్యామి = ఎడమ భుజముమీదుగ కట్టుకొనుచున్నాను.

## యజ్ఞోపవీత మన్త్రవిశేషములు

ఇందలి 3,4,5 మన్త్రములు ఆ యా భాష్యములలో వ్రాయబడి యున్నవే గాని, అవి యెచ్చటివో తెలియదు. మొదటి మంత్రము పరబ్రహ్మ ప్రతిపాదకములగు అష్టోత్తరశతోపనిషత్తులలోని బ్రహ్మోపనిషత్తు నందు కనుపించుచున్నది. కాని, కర్మకాండ ప్రతిపాదక శ్రుతులయం దెచ్చటను గానరాదు. అయినను దీని కుభయార్థకత్వమును తత్తద్భాష్య కర్తలు బోధించుచున్నారు. ఈ మంత్రమునందు శబ్దకల్పద్రుమమున "ప్రజాపతే ర్యత్సహజం" అనుటకు బదులుగా "బృహస్పతే ర్యత్సహజమ్", అనుపాఠాంతరము గన్పించుచున్నది. కాని, ఈ పాఠము ననుసరించి యెవ్వరును భాష్యములు చేసియుండలేదు. విశేషించి యీ మంత్రమే సర్వశాఖలందు వ్యాప్తిజెంది యున్నది. ఇట్టిదానిని 'ఆచారభూషణకారుడు' "నను యజ్ఞోపవీతం పరమం పవిత్ర మితి" యజ్ఞోపవీత ధారణమంత్ర స్త్వాధర్వణీయ బ్రహ్మోపనిషది ప్రసిద్ధః, తత్పఠనం తు వినా తద్వేదాధ్య

యవార్థం విహిత ముపనయనానన్తర మనువన్నం తథాచాత్ర విహితం వ్యాహృతిభి స్తద్ధారణమేవ న్యాయ్యమ్" అనగా "యజ్ఞోపవీతం పరమం పవిత్రమ్" అను మంత్ర మాథర్వణ వేదమునకు సంబంధించిన బ్రహ్మో పనిషత్తులోనిదగుటవలన ఆ వేదమునకు సంబంధించిన యుపనయనము లేనిదే ఆ మంత్రమును పఠింపగూడదు. వ్యాహృతులతో నుపవీతమును ధరించవలయును—అని అనుచున్నాడు. ఈయన ఇట్లనుచున్నను అనేక ప్రతులం దీ బ్రహ్మోపనిషత్తు యాజుషియని కనబడుచుండుటచేతను యాజుష్యుడును యజ్ఞసూత్ర ధారణప్రతిపాదకుడు నగు బోధాయనమహర్షి (పు.17) "యజ్ఞోపవీతం ప్రతిముఞ్చ ఇతి వాచయతి 'యజ్ఞోపవీతం పరమం పవిత్రమితి'యని 'యజ్ఞోపవీతం పరమం పవిత్రం' అను మంత్రముతో ధార ణమును విధించుటవలన యాజుషు లీ మంత్రముతో యజ్ఞోపవీతమును ధరించుటకు సందియ ముండదు.

2. ఈ 'యజ్ఞోపవీతం పరమం పవిత్ర' మను మంత్రమునకు చూపబడిన భాష్యములో 'ప్రతిముఞ్చ' అను విధ్యాశీర్బోధకమగు లోట్టు మధ్యమపురుషను ల దుత్తమపురుష బోధకముగ పరిణమింపచేసి ఆచార్య సంబోధనముతో భాష్యము జేయబడుట హృదయంగమముగ గన్పట్టదు.

ఈ కారణమువలన నీ భాష్యముకంటె నారాయణపండితకృత బ్రహ్మో పనిష ద్భాష్యములో సూక్ష్మోపవీతము వివరింపబడి "స్థూలోపవీతస్య వాచకం పరిధానమన్త్ర మాహ యజ్ఞేతి... ... ప్రతిముఞ్చ=పరిధేహి, హేశిష్య! బలం=బలప్రదం, తేజః=తేజఃప్రదం, చాస్తు తవేతి శేషః" అని ఆచా-ర్యుడు శిష్యుని సంబోధించి యజ్ఞోపవీతమును ధరింపజేయుచున్నాడు. ఇట్లు విధ్యాశీర్బోధకమగు లోట్టును యథాస్థితముగ నుంచి ఆచార్యుడు శిష్యుని సంబోధించి పఠింపజేయుచు ధరింపజేయుట యుక్తముగా గన్పట్టు చున్నది.

ఈ యర్థము ననుసరించి శిష్యుడు తాను మాత్రోపవీతమును ధరించు నపుడు అంతరాత్మను సంబోధించుకొని ధరించును. ఈ యర్థమునకు "యజ్ఞోపవీతం ప్రతిముఞ్చ ఇతి వాచయతి యజ్ఞోపవీతం పరమం పవిత్ర"

మను బోధాయన సూక్తి దోహద మొసగుచున్నది. కాన నారాయణ పండిత భాష్యము ననుసరించిన అర్థము నిట్లు తెలిపికొనవలయును.

మం॥ యజ్ఞోపవీతం... ... ... తేజః.

(హే. శిష్య=ఓ శిష్యుడా! హే. అన్తరాత్మ=ఓ అంతరాత్మా!) ప్రజాపతేః=బ్రహ్మకు, పురస్తాత్=పూర్వమందు, యత్=ఏ, సహజం=స్వత స్సిద్ధమగు, హార్దచైతన్య జ్యోతిస్సు గలదో, తత్=అది, యజ్ఞోపవీతం, హృదయదేశ స్థితిచే యజ్ఞోపవీతమని చెప్పబడుచున్నది.

(సూత్రమున్ను ఆ హృదయదేశస్థితివలన) పరమం=ఉత్కృష్ట మును, పవిత్రం=పవిత్రమునై యున్నది. (అతః=ఈ కారణము వలన, శుభ్రం=అట్టి, స్వచ్ఛమగు, యజ్ఞోపవీతం=సూత్రాత్మక యజ్ఞోపవీ-తమును, ప్రతిముఞ్చ=ధరింపుము. (ఆ యజ్ఞోపవీతము) అగ్ర్యం=శ్రే ష్ఠత్వమును, ఆయుష్యం=ఆయుష్యమును, తేజః=తేజస్సు నిచ్చునదియు, అస్తు=అగుగాక.

(ఇట్లు విపరిణామము లేకుండ పూర్వ భాష్యమైనను సమన్వ-యించును.)

మం॥ కర్మ ణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః।
తేభి ర్ధార్య మిదం సూత్రం కర్మాఙ్గం తద్ధి వై స్మృతమ్॥
(త్రైస్సంధార్య మిదం సూత్రమితి పాఠాన్తరమ్).

భా॥ "యే బ్రాహ్మణాదయః కర్మ ణ్యధికృతా స్సరాగా స్తైరేవ బహిస్సూత్రం సమ్యగ్ధార్యమ్. న నివృత్తై ర్హి యస్మా త్కర్మాఙ్గం స్మృతమ్....."

తా॥ నిష్కాములుగాక సకాములై వైదిక కర్మానుష్ఠానమున కర్తలగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు వైదిక కర్మాంగమగు నీ బహిస్సూత్రమును ముఖ్యముగా ధరించవలయును.

3. నాల్గవ మంత్రార్థ మనన్వితముగ నుండుటవలన పాఠకు లీ క్రింది విధమును సముచితమని గ్రహింపగలరు. మూడవమంత్రమున 'యజ్ఞోపవీ

తేవ' అను పద మధ్యాహృతమై వటుసంబోధనముచే నన్వయము పూర్తి గావింపబడినది. నాల్గవమంత్ర 'ముపవీతేవ' అను పద మధికముగ గలదై మూడవ మంత్రమువలె మున్నది. కావున మూడవమంత్రముయొక్క అర్థమే నాల్గవమంత్రమునకు చెప్పటలో నౌచిత్యము గలదు. ఇదిగాక ప్రథమమంత్ర మాచార్యకర్తృక మనియు, ఈ నాల్గవ మంత్రము వటువు స్వయముగా యజ్ఞ సూత్రమును ధరించుట కుపయోగించుచున్నదనియు కారక గృహ్య వ్యాఖ్యానమున గలదు. అపుడు నాల్గవమంత్రమున అంతరాత్మసంబోధనము యుక్తమగుచున్నది.

## యజ్ఞోపవీతమన్త్రార్థము (ఆధ్యాత్మికము)

ఉపనిషద్బ్రహ్మయోగి భాష్యానుసారము బ్రహ్మోపనిషత్; మం॥ యజ్ఞోపవీతం ... బల మస్తు తేజః. యజ్ఞోపవీతం, యజ్ఞ=విష్ణువునకు, ఉప=సమీపమునందు, వీతం=విశేషముగా వచ్చినది. (వ్యావహారికజీవ స్వరూపము) అదియే స్వగత కల్పితజీవత్వము తొలగగనే, పరమం పవిత్రం=సర్వాధికమై, నిత్యశుద్ధమై యుండును. అట్టి పరతత్త్వమే (త్వంపదలక్ష్యార్థమే) ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్=చతుర్ముఖునకు గూడ పూర్వము సహజమైన రూపము, (తత్పదలక్ష్యార్థమని తాత్పర్యము).

ఆయుష్య మగ్ర్యం=ప్రాణాదులకు గూడ నధిష్ఠానమగుటచే సర్వోజ్జీవకమును, సర్వశ్రేష్ఠము నై యున్నది. కావున, ప్రతిముఞ్చ=(ఇట్టి యజ్ఞోపవీతరూపమగు తన నిజస్వరూపమును గుర్తించిన వెంటనే), కల్పిత జీవ జగద్భావమును వదలుము. శుభ్రం=స్వయంప్రకాశమగు ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపమునే అవలంబించుము. ఇచట పరబ్రహ్మోపనిషత్ప్రక-రణములో సన్న్యాసము ప్రస్తుతము గావున అట్టిపరమార్థ యజ్ఞోప-వీతస్వరూపమగు నఖండ చిదాత్మతత్త్వము నవలంబించిన స్థితిలో కల్పితజీవ జగద్భావమే గళితమగుచుండుటచే తదాశ్రయమగు బాహ్యతంతు స్వరూప యజ్ఞోపవీత మోచనము ప్రకృతసన్న్యాసాంగముగ కైముతిక న్యాయసిద్ధమని భావము.

సామాన్యగృహస్థాదుల కన్ననో పై రీతిగ పై మంత్రార్థ మెరుంగుట వలన బాహ్య యజ్ఞోపవీత ధారణము కల్పిత దేహాద్యాత్మభావ మాత్ర ప్రయుక్త మగుటచే అట్టి భావ మున్నంతవఱకు బాహ్యమాత్ర మవస రమే యనియు, ఇట్టి యథావిధి సూత్రమును ధరించియే అధ్యయన యజన యాజనాదులు చేయవలయునని శ్రుతమగుచుండుటచే వేతత్సూత్ర ధారణము చెప్పబడిన అధ్యయనాద్యాశ్రమత్రయ విహితకర్మలను పరమే శ్వరానుగ్రహ ఫలకములుగ గావించి పూర్వోక్త పారమార్థిక ప్రత్యగభిన్న బ్రహ్మాత్మభూత యజ్ఞోపవీత రూపముగ పర్యవసన్నమగు గావున నట్టిస్థితి యబ్బువరకు నీ బాహ్య యజ్ఞోపవీత ధారణ మాశ్రమత్రయస్థుల కత్యవసర మగుననియు నిచట తాత్పర్యము.

యజ్ఞోపవీతం; (ఏ కారణమువలన) యజ్ఞ=సర్వాత్మ భూతమగు చైతన్యమున కభివ్యక్తి స్థానమగు హృదయదేశమునకు, ఉప=సమీపమందు, వీతం=మూడు పేటలు గలిగిన దారపు రూపమున త్రైవర్ణిక ధార్యముగ నుండెనో; ఆ కార్పాస సూత్రమే, బలం=పూర్వోక్తమగు అఖండ చైత న్యాత్మక పరబ్రహ్మ జ్ఞానమునకు సాధనమైన నిఖిల శ్రౌత స్మార్తకర్మా-నుష్ఠాన సామర్థ్యము నిచ్చునదై, అస్తు తేజః=బ్రహ్మవర్చసాది వృద్ధికర మగుగాక.

## శంకరానందీయ భాష్య తాత్పర్యము

యజ్ఞశబ్దముచే చెప్పబడు పరమాత్మ తత్త్వ మొక్కటే జీవభావమున ననేకరూపముల నొందినది. అది యుత్కృష్టమును, స్వతశ్శుద్ధమును నైనట్టిది. గొప్పవాడైన ప్రజాపతికిగూడ ఏ పరమాత్మ పూర్వసిద్ధాత్మ స్వరూపమై స్వతస్సిద్ధమై సర్వవ్యవహార కారణమగుచున్నదో, అది సర్వవస్తు సత్తాసంపాదకమగుటచే సర్వశ్రేష్ఠమై యున్నది. అట్టి పరమాత్మ స్వరూ పమగు నో యజ్ఞోపవీతమా! అవిద్యా కామకర్మాది రూపమగు కల్పిత జీవభావమునుండి నన్ను విముక్తుని జేయుము. నిత్యశుద్ధ బుద్ధాత్ముని జేయుము.

ప్రత్తిదారములతో నిర్మింపబడిన యే బాహ్యయజ్ఞోపవీతము పరమార్థ యజ్ఞోపవీతరూప హృదయ చైతన్యాశ్రితమై తత్ప్రాప్త్యర్థమైన వర్ణాశ్రమధర్మానుష్ఠానము కొఱకు త్రైవర్ణికులచే ధరింపబడుచున్నదో; అయ్యది నిర్మల త్కర్మసాధనమును, బ్రహ్మవర్చస కారణమును నగుగాక.

## యజ్ఞోపవీత నిర్మాణ ధారణములు

### (సంస్కారరత్నమాలాయాం బోధాయనః)

"అథాతో యజ్ఞోపవీతవిధిం వ్యాఖ్యాస్యామో, బ్రాహ్మణేన తత్కన్యయా వా కృతం సూత్ర మాసీయ భూ రితి ప్రథమాం షణ్ణవతిం మినోతి. భువ ఇతి ద్వితీయాం సువ రితి తృతీయాం మిత్వా పలాశపత్రే సంస్థాప్యాపోహిష్ఠేతి తిసృభి ర్హిరణ్యవర్ణా ఇతి చతసృభిః పవమాన స్సువర్జన ఇత్యేతేనానువాకేన సావిత్ర్యా చాభిషిచ్య వామహస్తే కృత్వా త్రి స్సంతాడ్య, భూరగ్నించే త్యేతై స్త్రిభి ర్వలితం కృత్వా, భూ ర్భువ స్సువ శ్చంద్రమసం చే త్యేతేన గ్రంథిం కృత్వా, ఓంకార మగ్నిం నాగా న్యమం పితౄన్ ప్రజాపతిం వాయుం సూర్యం విశ్వాన్దేవాన్ నవ తన్తుషు క్రమేణ విన్యస్య సంపూజయేత్. ద్దేవ స్యత్వే త్యుపవీత మాదాయ, ఉద్వయంతమసస్పరీ త్యాదిత్యాయ దర్శయిత్వా యజ్ఞోపవీతం ... ... ... తేజః. ఇతి ధారయే దిత్యాహ భగవాన్ బోధాయనః.

తా॥ బ్రాహ్మణునిచే గాని, బ్రాహ్మణకన్యచే గాని వడకబడిన సూత్రమును దీసికొని, మొదటి తొంబదియారు బెత్తలను 'భూః' అను మంత్రముతోను, రెండవ తొంబదియారు బెత్తలను 'భువః' అను మంత్రముతోను, మూడవ తొంబదియారు బెత్తలను 'సువః' అను మన్త్రముతోను కొలిచి దానిని మోదుగాకునం దుంచి 'ఆపోహిష్ఠామ', ఈ మొదలగు మూడుమంత్రములతోను, 'హిరణ్యవర్ణా' అను నాల్గు మంత్రములతోను, 'పవమాన స్సువర్జన' అను అనువాకముతోను, గాయత్రీమంత్రముతోను అభిషేకించి, ఎడమచేతియం దుంచుకొని మూడుసార్లు కుడిచేతితో కొట్టి "భూ రగ్నించ" ఈ మొదలగు మంత్రములతో పేని (తాల్చి)

'భూర్భువ స్సువ శ్చన్ద్రోమసం' అను మంత్రముతో ముడివేసి, ఓంకారమును, అగ్నిని, సర్పములను, యముని, పితృదేవతలను, ప్రజాపతిని, వాయువును, సూర్యుని, విశ్వేదేవతలను తొమ్మిది దారములందు క్రమముగా ఆవాహన జేసి పూజించవలయును. పిమ్మట 'దేవస్య' అను మంత్రముచే ఆ యుపవీతమును కుడిచేతిలోనికి తీసికొని 'ఉద్వయం' అను మంత్రముతో సూర్యునికి జూపించి "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అను మంత్రముతో ధరించవలయును.

ఈ విధానమున బోధాయన మతము, పుస్తక భేదముల ననుసరించి పాఠభేదములతో కనుపించుచున్నది. అందు సంస్కారభేదములే గాక, ఉపవీతము బ్రాహ్మణవిధవాస్త్రీగూడ నిర్మించవచ్చునని కనుపించుచున్నది. మఱియు ఈ నిర్మాణధారణములను గుఱించి వైద్యనాథదీక్షితీయ (స్మృతి ముక్తాఫల)మందలి ప్రకారాంతరమును వ్రాసెదను.

స్మృతిముక్తాఫలమున—

శ్లో॥ యజ్ఞోపవీతం కుర్వీత సూత్రంతు నవతన్తుకమ్,
త్రివృ దూర్ధ్వవృతం కార్యం తన్తుత్రయ మధో వృతమ్.

అని (మాధవీయ వచనము). అనగ యజ్ఞోపవీతమునకు తొమ్మిది దారము లుండవలయును. మొదట మూడుపోగులు గల దానినిగ జేసి పైకి పేనవలయును (త్రివృదితి త్రిగుణం కృత్వా ఊర్ధ్వవృతం దక్షిణమావర్తితమ్." మను వ్యా॥). పిమ్మట దానిని మూడుమడతలుగలదానినిగ జేసి క్రిందికి పేనవలయును. ఇట్లు సిద్ధమైన యజ్ఞోపవీతములోని యొక్కొక దారమునకు ఒక్కొక యధిపతిని దేవలుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఓంకారః ప్రథమ స్తంతు ర్ద్వితీయోఽగ్ని స్తథైవ చ,
తృతీయో భగదైవత్య శ్చతుర్థ స్సోమదైవతః.
పఞ్చమః పితృదైవత్య షష్ఠ శ్చైవ ప్రజాపతిః,
సప్తమో వసుదైవత్యః ధర్మ శ్చాష్టమ ఏవ చ,
నవమ స్సర్వదైవత్యఇత్యేతే నవ తన్తవః.

అనగా నోంకారము, అగ్ని, భగుడు, సోముదు, పిత్ర్య దేవతలు, ప్రజాపతి, అష్టవసువులు, ధర్మదేవత, సర్వదేవతలు — క్రమముగా తొమ్మిది దారములకు అధిపతులు.

ఇట్లు తన్త్వధిపతులను జెప్పి, నిర్మాణప్రకారమునుగూడ నీ క్రింది విధమున జెప్పచున్నాడు.

శ్లో॥ గ్రామాన్నిష్క్రమ్య సంఖ్యాయ షణ్ణవత్యఙ్గుళీషుతత్,
తావత్త్రిగుణితం సూత్రం ప్రక్షాళ్యాబ్లిఙ్గకైః స్త్రిభిః.
దేవాగారేఽథ వా గోష్ఠే నద్యాం వాఽన్యత్ర వా శుచౌ,
సావిత్ర్యా త్రివృతం కుర్యా న్నవసూత్రంతు తద్భవేత్.
అథ త్రిర్వేష్టితవ్యంస్యా త్పిత్ర్యాణాం తృప్తిదం హి తత్.

శ్లో॥ సవ్యే మృదం గృహీత్వాఽస్మిన్ స్థాపయే ద్భూరితి బ్రువన్,
పత్రం పుష్పం ఫలం వాఽపి వ్యాహృతీభిః ప్రతిక్షిపేత్.
అభిమన్త్ర్యాఽథ భూరగ్నించేతి త్రివృత్త్రియం త్రిభిః,
హరిబ్రహ్మేశ్వరేభ్యశ్చ ప్రణమ్యావేదయేదితి.

అనగా నూరి వెలుపలకు వెళ్ళి తొంబదియారు బెత్తల దారమును దీసికొని దానికి మరిరెండు రెట్లు దారమును జేర్చి అబ్లిఙ్గ మంత్రములతో నద్దానిని కడిగి దేవాలయమందు గాని, గోశాలలోగాని నదియందు గాని వీటికంటె నన్యమగు ప్రదేశమందుగాని గాయత్రీమంత్రముతో దానిని మూడుమడతలు కలదానినిగ జేసిన నది తొమ్మిది పోగులు గలదగును.

పిమ్మట దానిని మూడుపేటలు గల దానినిగ జేసిన నది పిత్ర్య దేవతలకు తృప్తి నిచ్చు యజ్ఞసూత్ర మగుచున్నది. పిమ్మట దానిని మూడు పర్యాయములు కొట్టుటవలన నది పిత్ర్య దేవతలకు తృప్తి నిచ్చునది యగుచున్నది. పిమ్మట దానిని ఎడమచేతియం దుంచుకొని దానిమీద "భూః" అని యుచ్చరించుచు మట్టిని ఉంచి, వ్యాహృతులతో పత్రి, పుష్ప, ఫలములలో నే యొక్కదానినైన నుంచి 'భూరగ్నిశ్చ' ఇత్యాది మంత్ర

త్రయముతో నభిమంత్రించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నమస్కరించి నివేదించిన నది యజ్ఞోపవీత మగుచున్నదని తాత్పర్యము.

పిమ్మట నిట్టి యజ్ఞోపవీతమునకు ముడివి పరిమాణమును కాత్యాయనుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ త్రివృతం చోపవీతంస్యా త్తస్యైకో గ్రంథి రిష్యతే,
పృష్ఠవంశే చ నాభ్యాం చ ధృతం య ద్విన్దతే కటిమ్.
తద్ధార్య ముపవీతం స్యా న్నాతిలమ్బం న చోచ్ఛ్రితమ్.

అనగా తొమ్మిది పోగులుగల యజ్ఞోపవీతమున కొక ముడి యుండవలయు ననియు, నద్దానిని వెన్నెముకయందును, నాభియందును కటి (మొల) వఱకు ధరించవలయు ననియు, ఆ యుపవీతము మిక్కిలి పొడవుగ గాని, పొట్టిదిగ గాని యుండగూడదనియు తాత్పర్యము. ఇచట 'త్రివృత్'. అనగా తొమ్మిదింటి సముదాయము (నవ వై త్రివృత్ ఇతి శ్రుతిః). మఱియు నాయజ్ఞోపవీతము బొడ్డుకు పైగ నున్న ఆయుస్సున్ను, బొడ్డుకు క్రిందుగనున్న తపస్సున్ను క్షీణించును గాన, బొడ్డుకు సమముగ నుండవలయునని వశిష్ఠ శాతాతపులు—

శ్లో॥ నాభే రూర్ధ్వ మనాయుష్య మధో నాభే స్తపః క్షయః,
తస్మా న్నాభిసమం కుర్యా దుపవీతం విచక్షణః.

అని చెప్పుచున్నారు. ఇట్టిది దొఱకనపుడు దేవలుడు "స్తనా దూర్ధ్వ మధో నాభే ర్న కర్తవ్యం కథంచన" అని. స్తనముకంటె పైనను బొడ్డుకు క్రిందుగను నుండని యజ్ఞోపవీతము పనికివచ్చు ననుచున్నాడు.

## ధర్మప్రవృత్తి మతము

నిర్మాణ విధానాదికమందు ధర్మప్రవృత్తియం దీక్రింది విధమున భేదములు కనుపించుచున్నవి.

శ్లో॥ ఊర్ధ్వవృత్త మథోవృత్తం పున రూర్ధ్వవృతం తథా,
ఏత ద్యజ్ఞోపవీతం స్యా త్తస్యైకో గ్రన్థి రిష్యతే.

అనగా మొదట యజ్ఞోపవీతపు దారముమ పై పురి గల దాని విగ నిర్మించవలయును. పిమ్మట మొదటి తాల్పు (పురి వేయుట), క్రిందికి వేయవలయును. తరువాత రెండవతాల్పు పై పురి గల్గునట్లు తాల్పవలయును.

"రవ్ద్రాది నాభిపర్యన్తం బ్రహ్మసూత్రం పవిత్రకమ్".

యజ్ఞోపవీతము నిలువున బ్రహ్మరంధ్రము మొదలు బొడ్డువరకు సరిపడు పొడవుగలదిగా నుండవలయును.

"విధవారచితం సూత్రం ... ... ఉత్సృజేత్".

విధవచే నిర్మింపబడిన సూత్రమును ధరించగూడదు.

## ధార్యోపవీత సంఖ్యానము

1.శ్లో॥ ఉపవీతం వటో రేకం ద్వే తథేతరయో స్స్మృతే,
ఏకమేవ యతీనాం స్యా దితి శాస్త్రస్య నిశ్చయః.

తా॥ బ్రహ్మచారి కొక యుపవీతము, గృహస్థ వానప్రస్థులకు రెండేసి యుపవీతములు, యతి కొక్క యుపవీతము నుండవలయును. (యతిస్త్రి దణ్డి). —స్మృతి ముక్తాఫలమున భృగుమహర్షి.

2.శ్లో॥ బ్రహ్మచారిణ ఏకంస్యా త్స్నాతస్య ద్వే బహూనివ,
తృతీయ ముత్తరీయం స్యా ద్వస్త్రాభావే తదిష్యతే.

తా॥ బ్రహ్మచారి కొకయుపవీతము, స్నాతకునకు రెండు గాని అనేకములుగాని యుండవలయును. మూడవదానిని - అనేకములు ధరించినను, ధరింపకున్నను - ఉత్తరీయార్థమై ధరించవలయును. — దేవలుడు.

3.శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తే చ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థే వస్త్రాభావే తదిష్యతే. — దేవలుడు.

తా॥ శ్రౌత స్మార్త కర్మలనిమిత్తమై రెండు యజ్ఞోపవీతములమ ధరించవలయును. ఉత్తరీయము నిమిత్తమై మూడవ యుపవీతమును ధరించ

వలయును. అట్లు ధరించిన వది యుత్తరీయము లేనపుడు తదర్థమై యుపయోగించును.

4.శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే దైవపిత్రోశ్చ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థే ఆయుష్కామో బహూన్యపి.

— *చతుర్వింశతి మత సంగ్రహము.*

తా॥ దేవపితృ కర్మల నిమిత్తమై రెండు యజ్ఞోపవీతములను ధరించవలయును. మూడవదానిని ఉత్తరీయార్థము ధరించవలయును. ఆయురభివృద్ధి గోరువాడు బహు యజ్ఞోపవీతముల ధరించవలయును.

5.శ్లో॥ యజ్ఞోపవీతే ద్వే ధార్యే శ్రౌతే స్మార్తేచ కర్మణి,
తృతీయ ముత్తరీయార్థే వస్త్రాభావే చతుర్థకమ్.

— *సంస్కార గణపతియందు మనువు.*

తా॥ శ్రౌత స్మార్తకర్మల నిమిత్తమై రెండుపవీతములను, మూడవదానిని ఉత్తరీయమునకు బదులుగాను, నాల్గవ యుపవీతమును మఱి యొక యుత్తరీయమునకు ప్రతినిధిగను ధరించవలెను.

6.శ్లో॥ మౌంజ్యర్థ మేకం ప్రథమం, వివాహే తు ద్వితీయకమ్,
ఉత్తరీయే తృతీయం స్యా, ద్వాసపోఽర్థే తురీయకమ్.

శ్లో॥ సూత్రత్రయం తు కథితం వనినాం సతతం పరమ్,
కేచి త్పంచేతి సప్తేతి తేషాం ప్రోచుశ్చ మన్త్రితః.

— *ఔశనస స్మృతి.*

తా॥ ఉపనయన నిమిత్తమున కొక్కదానిని, వివాహము నిమిత్తమై రెండవదానిని, ఉత్తరీయార్థమై మూడవదానిని, మఱియొక యుత్తరీయము నిమిత్తమై నాల్గవ యుపవీతమును ధరించవలయును.

వానప్రస్థులు మూడుగాని, అయిదుగాని, యేడు యజ్ఞోపవీతములను గాని ధరించవలయును.

గృహాశ్రమీ ద్వే యజ్ఞోపవీతే ... ... ... ౩-౧-౧.
... ... త్రీణ్యుపవీతాన్యుత్తరీయం చ (వనస్థః) ౨-౨-౨.

తా॥ గృహస్థు రెండుపవీతములను, వానప్రస్థు మూడుపవీతములను ధరించవలయును. — వైఖానస ధర్మసూత్రము

3.శ్లో॥ చతుర్వేదస్య చత్వారి, త్రివేదస్య త్రికం భవేత్,
ద్వే స్యాతాం వై ద్వివేదస్య, ఏకమేవైక వేదినః.
— (స్మృ. షట్. గృహ్యపరిశిష్టము)

తా॥ నాల్గువేదములు చదివినవాడు నాల్గింటిని, మూడు వేదములు జదివినవాడు మూడింటిని, రెండు వేదములు చదివినవాడు రెండింటిని, ఒక్కవేదము జదివినవా డొక్క యుపవీతమును ధరించవలయును.

"పఞ్చభిః పుత్త్రికామస్తు ధర్మకామ స్తథైవ చ." — ధర్మప్రవృత్తి.

తా॥ ధర్మకాముడు, పుత్త్రికాముడు అయిదు యజ్ఞోపవీతములు ధరించవలయును.

"దశాష్టౌ వా గృహస్థస్య చత్వారి వనవాసినః"

తా॥ గృహస్థు పదింటినిగాని, యెనిమిదింటినిగాని, వానప్రస్థు నాలుగు పవీతములను ధరించవలయును.

"బహూని వాయుష్కామస్యేత్యాది కామ్యం ప్రచక్షతే"— ధర్మప్రవృత్తి.

తా॥ ఆయుష్కాముడు బహు యజ్ఞోపవీతముల ధరించవలయును.

ఇట్టి వచనములవలన యజ్ఞోపవీతసంఖ్య బహుత్వము నధిష్ఠించినది. వీటియందు రెండు మొదలు ఆరవదివఱకు గల వచనములు ప్రథమ ద్వితీయోపవీతములను వేరు వేరు నిమిత్తములతో విధించినను మూడవ దానిని ఐకకర్మ్యముగ నుత్తరీయ స్థానమున విధించుటవలన క్రత్వర్థమగు నుత్తరీయోపవీతముయొక్క ప్రాధాన్యము వెల్లడియగుచున్నది. కావున నిదిలేని వైదిక కర్మానుష్ఠానము వ్యర్థమనునది సర్వస్మృతిసమ్మతము. మిగి-

లివన్నియు వేరు వేరు నిమిత్తములతో విధింపబడి విర్దిష్టములగు ఆ యా ఫలముల నిచ్చునవైనను వానినన్నిటిని పూర్వోక్తరీతిని మహాఫలదమగు పురుషార్థసూత్రముయొక్క రూపాంతరములుగ నిశ్చయించుకొనవచ్చును.

రెండవ వచనము "స్నాతకస్య ద్వే బహూని వా" అని చెప్పుటవలన ద్వితీయాద్యుపవీతములు స్నాతక వ్రతము మొదలు ప్రాప్తించుచున్నవని తెలియుచున్నది.

విశేషమేమన! ఆపస్తమ్బ హిరణ్యకేశియాది బ్రహ్మచారులు, గృహస్థులు, క్రత్వర్థపురుషార్థతల నిమిత్తమై అజినోత్తరీయములకు ప్రతినిధిగ నొకే యజ్ఞసూత్రమును ధరించవలసినవారైనప్పటికిని గృహస్థులకు ఆచరణలోనున్న అనేక యజ్ఞసూత్రధారణ మనునది ఆశ్రమాభివ్యంజకతను, కామ్యఫలదత్వమును ప్రతిపాదించు స్మృత్యంతరోక్తమగు నాచారమై యున్నది. మఱియు బోధాయనులు గృహస్థుకే రెండుపవీతములు విధించుటవలన బ్రహ్మచారి పురుషార్థసూత్రము నొక్క దానినే ధరించవలయుననియు, ఉత్తరీయప్రతినిధి సూత్రమును, కర్మానుష్ఠానకాలమ్ముం దుత్తరీయాభావమందే ధరించవలయుననియు మనము తెలిసికొనవచ్చును.

ఎవ్వరెన్ని యజ్ఞోపవీతములు ధరింపదలచిరో వారు తాము ధరించు ప్రతి యజ్ఞోపవీతమును అన్నిమారు లాచమించి అన్నిమారులును మంత్రముతోనే ధరించవలయునని భరద్వాజ మహర్షి—

శ్లో॥ వనస్థస్య గృహస్థస్య సూత్రం ప్రతి పునఃపునః,
మన్త్రోచ్చారణ మాచామో ద్వితయం క్రమశః స్మృతమ్.

— అని చెప్పుచున్నాడు.

## యజ్ఞోపవీత ధారణ సంకల్పము

— *(స్మృతి రత్నమాల).*

మమ శ్రౌత స్మార్త విహిత నిత్య కర్మానుష్ఠానయోగ్యతాసిద్ధ్యర్థం బ్రహ్మతేజోఽభివృద్ధ్యర్థం యజ్ఞోపవీత ధారణం కరిష్యే॥

యజ్ఞోపవీత మిత్యస్య మన్త్రస్య పరబ్రహ్మ ఋషిః, త్రిష్టుప్ఛన్దః, వేదా స్త్రయో దేవతాః, యజ్ఞోపవీత ధారణే వినియోగః, యజ్ఞోపవీతం....తేజః.

## భరద్వాజమత ధారణము

యజ్ఞోపవీత మిత్యస్య మన్త్రస్య, ప్రజాపతి ఋషిః, త్రిష్టుప్ ఛన్దః, వేదా స్త్రయో దేవతాః, యజ్ఞోపవీత ధారణే వినియోగః, యజ్ఞోపవీతం ... ... తేజః.

## పారస్కరోపనయన పద్ధతి

యజ్ఞోపవీతమిత్యస్య మన్త్రస్య, పరమేష్ఠీ ఋషిః, మన్త్ర లిఙ్గోక్తా దేవతా, త్రిష్టుప్ ఛన్దః, యజ్ఞోపవీతపరిధానే వినియోగః, యజ్ఞోపవీతం పరమం పవిత్రం ... ... తేజః.

ఈ గ్రంథమున జేయబడిన విమర్శవలన బ్రహ్మచారి, గృహస్థుల యజ్ఞ సూత్ర ధారణమునకు ఈ క్రింది సంకల్పము విద్వ దామోదకరమగునవి భావించుచున్నాను.

## ఆపస్తమ్బ హిరణ్య కేశీయాదులకు

మమ శ్రౌత స్మార్త నిత్యనైమిత్తిక కామ్యకర్మానుష్ఠానయోగ్యతా సిద్ధ్యర్థం (బ్ర) అజినోపవీత, (గృ) వస్త్రోపవీత ప్రతినిధి యజ్ఞసూత్ర ధారణం కరిష్యే.

## బౌధాయనాదులకు

మమ బ్రహ్మతేజోఽభివృద్ధ్యర్థం యజ్ఞోపవీత ధారణం కరిష్యే (ఇది పురుషార్థమాత్రమునకు), మమ శ్రౌత స్మార్త.... సిద్ధ్యర్థం (బ్ర) అజినోత్తరీయ, (గృ) - వస్త్రోత్తరీయ ప్రతినిధి యజ్ఞోపవీత ధారణం కరిష్యే.

## జీర్ణోపవీత విసర్జన మంత్రములు

ఆచారభూషణే - కృష్ణభట్టీయే.

శ్లో॥ బ్రహ్మ విష్ణుమహేశాద్యా ప్తన్మూనాం దేవతా స్మృతాః,
త్యక్ష్యామి పుణ్యకాలేఽస్మిన్ భవతాం తృప్తిహేతవే.

తా॥ ఓ బ్రహ్మవిష్ణు మహేశ్వరులారా! మీ రీ యజ్ఞోపవీతపు దారములకు దేవతలు. ఈపుణ్యకాలమున మీతృప్తికొఱ కీ జీర్ణ యజ్ఞోపవీతమును వదిలిపెట్టుచున్నాను. ధర్మసింధువునందు "సముద్రం గచ్ఛ స్వాహా" యను మన్త్రముతోగాని, ప్రణవముతో గూడిన వ్యాహృతులతోగాని జీర్ణోపవీతమును వదిలిపెట్టవలయునని యున్నది.

మఱియు

శ్లో॥ ఉపవీతం ఛిన్నతన్తుం జీర్ణం కశ్మల దూషితమ్,
విసృజామి యశో బ్రహ్మతేజో దీర్ఘాయు రస్తు మే.

అని యున్నది.

తా॥ దారములు తెగిపోయి మురికిపట్టి ప్రాతబడిన ఉపవీతమును వదిలిపెట్టుచున్నాను. నాకు కీర్తి, బ్రహ్మతేజస్సు, దీర్ఘాయుష్యము కలుగుగాక.

## సంస్కార రత్నమాలయందు స్మృతిరత్నావళి

జీర్ణోపవీతమును "సముద్రం గచ్ఛ స్వాహా" అను మన్త్రముతోగాని, ప్రణవముతోగాని, వ్యాహృతిత్రయముతో గాని, నది, సముద్రము, తటాకములలో దేనియందైనను వదిలి పెట్టవలయును అని యున్నది.

## శిఖాయజ్ఞోపవీత మీమాంస

శ్లో॥ ఏతావ ద్దినపర్యన్తం బ్రహ్మత్వం ధారితం మయా,
జీర్ణత్వా త్త్వం పరిత్యక్తం గచ్ఛ సూత్ర! యథాసుఖమ్.

అనేన మన్త్రేణ ప్రాచీనయజ్ఞోపవీతం శిరోమార్గేణ నిస్సార్య యథాశక్తి గాయత్రీజపం కుర్యాత్.

తా॥ ఓ బ్రహ్మసూత్రమా! ఇంతవఱకు నిన్ను నేను ధరించితిని. నీవు ప్రాతబడుటవలన నిన్ను వదలిపెట్టుచున్నాను. నీవు సుఖముగా

వెళ్లుము. ఈ మంత్రముతో శిరస్సుగుండా యజ్ఞోపవీతమును తీసివేసి గాయత్రీ జపమును జేయవలయునని తాత్పర్యము. ఈ వ్రాయబడిన ధారణమంత్రములలోను విసర్జన మంత్రములలోను తమ యాచరణములో నున్నవానినే ఆ యా సమయములలో పఠించవలయును.

## యజ్ఞోపవీత లోప ప్రాయశ్చిత్తము

ధర్మ సింధు, నిర్ణయ సింధువులు:-

యజ్ఞోపవీతము పొరబాటున పోయిన మంత్రములేకుండ నొక యజ్ఞోపవీతమును ధరించి, 'మనోజ్యోతిః' అను మన్త్రముతో 'అగ్నేవ్రతపతే' అను మొదలగు నాల్గు మన్త్రములతోను హోమమునుజేసి నూత్నయజ్ఞోపవీతముల ధరించవలెను. అటుగానిచో 'యజ్ఞోపవీత నాశ జన్యదోష నిరాసార్థం ప్రాయశ్చిత్తం కరిష్యే' అని సంకల్పించి ఆచార్యవరణము, అగ్నిప్రతిష్ఠ, ఆజ్యభాగాన్తకర్మయు నైన పిమ్మట సూర్యు నుద్దేశించి గాయత్రీమంత్రముతో నేతితో తడిపిన నువ్వులతో వెయ్యిమారులు గాని, నూటయెనిమిది మారులుగాని, హోమమును జేసి నూతన యజ్ఞోపవీతమును ధరించి, అతిక్రమించిన (గడచిపోయిన) సంధ్యాదిక మాచరించవలయును. యజ్ఞోపవీతము లేక క్షణకాల ముండినను మూరుమార్లు గాయత్రీ జపమును జేయవలయును. యజ్ఞోపవీతములేకుండ భుజించినను, మలమూత్రములను విడిచినను ఎనిమిది వేల మారులు గాయత్రీ మన్త్రమును జపించవలయును. ముంజేతిమీదికి గాని, మణికట్టుమీదికి గాని జారిన, సరిగ దిద్దుకొని మూడుగాని, ఆరుగాని ప్రాణాయామముల జేసి నూతనమైనదానిని ధరించవలెను.

కోపాదికముచే స్వయముగ యజ్ఞోపవీతమును దీసిన, పూర్వోక్తమగు ప్రాయశ్చిత్తము జేసికొని క్రొత్తదానిని ధరించవలయును.

ధర్మ ప్రవృత్త్యాదులు:-

శ్లో॥ అభ్యఙ్గే చోదధిస్నానే మాతాపిత్రో ర్మృతేఽహని,
తైత్తిరీయాః కఠాః కాణ్వా చరా వాజసనేయినః,
కణ్ఠాదుత్తార్య సూత్రన్తు కుర్యు ర్వై క్షాలనం ద్విజాః."

అనగా, అభ్యంగము, సముద్రస్నానము, తల్లిదండ్రుల ప్రత్యాబ్దికములందు తైత్తిరీయులు, కఠులు, కాణ్వులు, చరకులు వాజసనేయులు మెడనుండి యజ్ఞసూత్రమును దీసి కడిగెదరు.

శ్లో॥ బహ్వృచ స్సామగా శ్చైవ యేచాఽన్యే యాజుషా స్తథా,
కణ్ఠా దుత్తార్య సూత్రన్తు పున ర్హర్షన్తి సంస్క్రియామ్.

అనగా బహ్వృచులు, సామగులు, తైత్తిరీయులకంటె' నితరులగు యాజుషులు యజ్ఞోపవీతమును మెడనుండి తీసిన ప్రాయశ్చిత్తార్హులు.

## గమనించవలసిన విషయము

పైన జెప్పబడిన కర్మలందు యజ్ఞోపవీతమును దీసెడి యాచారము గలవారును, పొరబాటున యజ్ఞోపవీతము పోయిన వారును, ఆ సమయముల నుత్తరీయమును ధరించియున్న యెడల ప్రాయశ్చిత్తార్హులు గారు. ఆచారము లేనివారు తీయగూడదు. ఇందుకు మనువు ४-౧౭८-౮.

శ్లో॥ యేనాస్య పితరో యాతాః యేన యాతాః పితామహాః,
తేన యాయా త్సతాం మార్గం తేన గచ్ఛ న్నరిష్యతి.

తా॥ పితృపితామహులు నడచిన సన్మార్గమున నడచువానికి హాని లేదు. — స్మృతి ముక్తాఫలము.

శ్లో॥ కాయస్థమేవ తత్కార్య ముత్థాప్యం న కదాచన,
సక్ృ దుద్ధరణా త్తస్య ప్రాయశ్చిత్తీయతే ద్విజః.
మన్త్రపూతం స్థితం కాయే యస్య యజ్ఞోపవీతకమ్,
నోద్ధరేత్తు తతః ప్రాజ్ఞో యదీచ్ఛే చ్ఛ్రియ ఆత్మనః.
వినా యచ్ఛిఖయా కర్మ వినా యజ్ఞోపవీతతః,

రాక్షసం తద్ధి విజ్ఞేయం సమస్తావిష్ఫలాః క్రియాః.
సదోపవీతినా భావ్యం సదా బద్ధశిఖేనచ,
విశిఖోఽవ్యుపవీతీచ యత్కరోతి న తత్కృతమ్.

అనగా నుపవీత మెల్లపుడు ధార్యమైనదనియు, దానిని శరీరమునుండి పైకి తీయగూడదనియు, తీసిన ప్రాయశ్చిత్తమున్నదనియు శిఖాయజ్ఞోపవీతములు లేని కర్మ రాక్షసమనియు తాత్పర్యము.

స్మృతి రత్నమాలయందు—

శ్లో॥ ఉపవీత వినాశే తు గాయత్ర్యా జుహుయా త్తిలాన్,
అష్టోత్తరసహస్రం వా అష్టోత్తరశతం తు వా.

— అని, ఉపవీతము పోయినపుడు గాయత్రీమంత్రముతో 1008 వెయ్యి యెనిమిదిగాని; నూటయెనిమిదిగాని, తిలహోమములుచేసి, తిరిగి స్వీకరించవలయునని విపుల ప్రయోగములు వ్రాయబడియున్నవి.

శ్లో॥ బ్రహ్మసూత్రం వినా భుజ్క్తే విణ్మూత్రం కురుతేఽథవా,
గాయత్ర్యష్టసహస్రేణ ప్రాణాయామేన శుధ్యతి.

— స్మృతి ముక్తాఫలము.

అనగా నుపవీతము లేక భోజనముజేసినను, మలమూత్రములు విడిచినను, ఎనిమిదివేల గాయత్రీ మంత్రముచేతను, ప్రాణాయామముచేతను శుద్ధి నొందుచున్నారు. ఉపనయన దీక్షామధ్యమం దుపవీతము పోయినచో సర్వప్రాయశ్చిత్త హోమమునుజేసి అనాజ్ఞాత త్రయ మంత్రములను పఠించవలయును.

## శూద్ర యజ్ఞోపవీతము

శూద్రునకు అధ్యాత్మరామాయణము, గరుడ పురాణము యజ్ఞోపవీతమును నిషేధించుచున్నవి. ధర్మ సింధువు ఉత్తమ శూద్రునకు పౌరాణికముగ నుపనయనమును, యజ్ఞోపవీతమును విధించుచున్నది. శూద్రకమలాకరము

"అపసవ్యం క్రమా ద్విస్త్రం కృత్వా కశ్చి త్సగోత్రజః" అని మైథిలవాచస్పతి వచనమును "ఉపవీతం వస్త్రవిన్యాసాత్" అను స్మృతి కౌముదీస్థిత బోధాయన వచనమును అనుసరించి పైతృక కర్మయందు వస్త్రము నుపవీతముగా విధించుచున్నది. శూద్ర కమలాకర ప్రయోగమను గ్రంథమున స్నాతక ప్రకరణమున "... ... నవం వస్త్రద్వయం సువర్ణోప వీతద్వయం ... ... సాదయిత్వా ... ... నూతన వస్త్రద్వయం సువర్ణోపవీతద్వయం ధృత్వా ఆచమ్య... ...." అని శూద్రుడు స్నాతకమున నగ్ని సమీపమున నాపాదించిన అంతరీయోత్తరీయములను, బంగారు జందెములను ధరించవలయునని కనుపించుచున్నది.

విచారింప నిచట శూద్రునకును ఉపవీతమగు నుత్తరీయము విధింపబడినది. నిత్యమును విహితములగు దైవ పితృకర్మల నాచరించు శూద్రునకా యుపవీతస్థానమున సూత్ర ముండుటలో ధర్మసింధూక్తి న్యాయ్యము గాక పోదు.

దేవచిహ్నమగు నుపవీతధారణమే మంగళకరము గాన సువర్ణోపవీత ధారణమున శూద్రుడును అధికపురుషార్థ లాభమును పొందవలయుననియే సువర్ణోపవీత ధారణము విధించబడినది. కావున శూద్రునకును శాస్త్రము వలన నుపవీతము సిద్ధించుచున్నది. అధ్యాత్మరామాయణాది కృత నిషేధ వచనములు కర్మలయందు ప్రవృత్తిలేక యజ్ఞసూత్రమును ధరించు శూద్ర పరములును, యజ్ఞసూత్రాభావము శూద్రునకు ప్రాయశ్చిత్త జనకముగాదనుటలోను ప్రమాణము లగుచున్నవి. ఇందువలన శూద్రుడును కర్మకాలమందే గాక ఎల్లపుడును ఉత్తరీయము నుపవీతముగా ధరించి దైవలక్షణ సంపాదకుడై తన భారతీయత్వ విశిష్టతను ప్రకాశింపజేయుచున్నాడు.

## యజ్ఞోపవీత ద్రవ్యములు

యజ్ఞోపవీత ద్రవ్యములు (౧) అజినము, (౨) వస్త్రము, (౩) కార్పాస (ప్రత్తి) సూత్రము, (౪) శణ(జనప) సూత్రము, (౫) ఆవిక (గొఱ్ఱెరోమము) సూత్రము నని మనకు తెలిపియున్నవి. ఇక వెన్ని ద్రవ్యములు గలవో విచారింతము.

బో.ధ. సూత్రము, "కౌశం సూత్రం వా ... ..." (౬) దర్భమయ మని వ్యాఖ్యానము. "కౌశం క్రిమికోశోత్థం" "పట్టసూత్రాదిమయ మిత్యర్థః" (శ.కల్పద్రుమము), (౭) పట్టు దారము (పురుషార్థసూత్రము) గాన ఇట్లనుటలో నౌచితి గలదు. దేవలుడు

**శ్లో॥ కార్పాస క్షౌమ గోవాల శణ వల్క తృణోద్భవమ్,**
**సదా సంభవతా ధార్య ముపవీతం ద్విజాతిభిః .**

— అని ప్రత్తి, (౮) అవిసెనార, (౯) గోవాల మను తృణవిశేషము (పోణుకు గడ్డి), (౧౦) తెల్లు, (౧౧) పవిత్రమగు నార, (౧౨) ముంజగడ్డి యుపవీతద్రవ్యములని చెప్పుచున్నాడు. ప్రత్తి దారము లేనపుడే మిగిలిన వస్తువులను క్రమముగా ధరించవలయునని స్మృతి ముక్తాఫలము. హారీతుడు "ముక్తామయోపవీతం చ చామీకర మథాఽపివా, ధార్యం తత్సర్వవర్ణానాం మహాదానాది కర్మసు" అని (౧౩) ముత్యాలతోను, (౧౪) బంగారు తోను గర్పింపబడినదానిని మహాదానాది కర్మలందు యోగ్యమగుదానినిగ విధించుచున్నాడు.

రాజమార్తాండుడు —

శ్లో॥ సత్యే స్వర్ణమయం సూత్రం, త్రేతాయాం రాజతం తథా,
ద్వాపరే తామ్రజం ప్రోక్తం, కలౌ కార్పాససంభవమ్."

— అని యుగ భేదము ననుసరించి కృతయుగమున బంగారము, త్రేతాయుగమున (౧౫) వెండి, ద్వాపరయుగమున (౧౬) రాగి, కలియందు ప్రత్తితోను నిర్మింపబడిన దానినిగ విధించెను.

శిఖా యజ్ఞోపవీత మీమాంసయందు—

**శ్లో॥ కృతే పద్మ మయం ప్రోక్తం, త్రేతాయాం కనకోద్భవమ్,**
**ద్వాపరే రాజతం ప్రోక్తం, కలౌ కార్పాససంభవమ్."**

— కృతయుగమున (౧౭) పద్మములతోను, త్రేతా, ద్వాపర, కలి యుగములలో బంగారు, వెండి, ప్రత్తి దారములతో నిర్మించబడునదిగా నున్నది.

శబ్దకల్పద్రుమమున వృద్ధాదిత్యసంహితయందు —

శ్లో॥ స్వర్ణం రౌప్యం తామ్ర మూర్ణం పట్టం కార్పాస బార్హిషమ్,
మృగాజినం గుటం శంఖీ యథా లభ్యం విధాయ చ,
యజ్ఞసూత్రం పరిచరే ద్విప్రో లిఙ్గక్రియాత్మకమ్."

— అని బంగారు, వెండి, రాగి, ఆవికము, పట్టు, ప్రత్తి, దర్భ, అజినము (౧౮) గుటము, (౧౯) శంఖి(కడిలవార) అను తృణ విశేషములతో నిర్మింపబడిన యజ్ఞసూత్రము బ్రాహ్మణత్వ చిహ్నముగ విధింపబడియున్నది. ఇప్పటికి ఉపవీత ద్రవ్యముల సంఖ్య (౧౯)గా తేలినది.

విశేషమేమన! సువర్ణతంతు ధారణవిధి వలన "సువర్ణ తంతూద్భవ - యజ్ఞసూత్రం ముక్తాఫలస్యూత మనేకరత్నమ్" అని — శ్రీ కృష్ణాది దేవతలకు భక్తితో సమర్పించుచుండు ముత్యములు, రత్నములు గూర్చిన బంగారు దారముల యజ్ఞసూత్రమును, కుమార సంభవమున —

శ్లో॥ ముక్తామయోపవీతాని బిభ్రతో హైమవల్కలాః,
రత్నాక్షసూత్రాః ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇవాశ్రితాః.

— అని శివకల్యాణమున రాయబారులుగా నుండిన సప్తమహర్షుల ముత్యాల జందెములును ప్రమాణితములై శుభాకాంక్షులకు ధార్యములుగ సూచితము లగుచున్నవి. ఇదిగాక, వివాహాది సమయముల శ్వశురాది బంధు దత్త సువర్ణోపవీత ధారణము శాస్త్రసిద్ధమై అత్యన్త శుభావహ మగుచున్నదని తెలియుచున్నది.

## యజ్ఞసూత్ర ధర్మవిశేషములు
### సంస్కార రత్నమాలయందు స్మృతిసారము

జ్ఞాతయగు తనకు జ్ఞేయమగు బ్రహ్మమునకును ఏకత్వమును తెలిసికొననిదే యజ్ఞోపవీతమును వదలగూడదు. శివుడు ప్రపంచమును సృష్టించదలచినవాడై సత్వ రజ స్తమో గుణాత్మకమైన మాయను ఈ సూత్రరూపముగ జేసినవాడు. భూ ర్భువ స్స్వ ర్లోకములు మూడు,

ఋగ్యజుస్సామ వేదములు మూడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురు, దక్షిణాగ్ని గార్హపత్య ఆహవనీయములను అగ్నులు మూడును మొత్తము పండ్రెండు దేవతలు గల యజ్ఞోపవీతము బ్రహ్మ క్షత్రియ వైశ్యులను మూడు వర్ణములవారికి ధరింపదగినది. దీని గురువు మెడలో వేసినది మొదలు తండ్రి యగుచున్నాడు. ఉపదేశింపబడిన గాయత్రీ మంత్రము తల్లి యగుచున్నది. ఈ బ్రహ్మసూత్రము ఓజస్సును, బ్రహ్మవర్చస్సును, పవిత్రతను కలుగజేయుచున్నది.

శ్రాద్ధ కల్పలతయందు ఆదిత్య పురాణము —

శ్లో॥ పితౄణాం వస్త్ర కృత్యే వాపోభి ర్దద్యా ద్యజ్ఞోపవీతకమ్,
యజ్ఞోపవీత దానేన వినా శ్రాద్ధం తు నిష్ఫలమ్.

అని యీ మొదలగు వచనములతో —

పితృదేవతలను పూజించి, వస్త్రములతో గూడ యజ్ఞోపవీతము నీయవలయును. యజ్ఞోపవీత మీయబడని శ్రాద్ధము నిష్ఫలము. శ్రాద్ధమున వస్త్రముల నీయలేని వాడు యజ్ఞోపవీతము నిచ్చిన యెడల వస్త్రదాన ఫలమును పొందుచున్నాడు — అని చెప్పుచున్నది.

## ధర్మసింధువు

మన్త్రసంస్కారము లేక నిర్మించిన యజ్ఞసూత్రమును "సిద్ధే మన్త్రాః ప్రయోక్తవ్యాః" అను న్యాయము ననుసరించి పూర్వోక్తములగు సంస్కారక మంత్రములతో సంస్కరించి ధరించవలయు ననుచున్నది.

## ధర్మప్రవృత్తి

శ్లో॥ యజ్ఞోపవీతే నైకేన జపహోమాదికం కృతమ్,
తత్సర్వం విలయం యాతి పితౄణాం నోపతిష్ఠతే.

అనగా నొకే యజ్ఞోపవీతముతో జేయబడిన జపహోమాదిక మంతయు వ్యర్థమై పితృదేవతలను పొందదు. అనగా పురుషార్థ సూత్రమును ధరించిన

వాడు ఉత్తరీయమునో, తదర్థసూత్రమునో ధరించియే జప హోమాదిక మాచరింపవలయునని తాత్పర్యము.

శ్లో॥ మానుషే ష్వంసయో స్సక్తం మైథునే పార్ష్ఠభాగికమ్,
తర్పణేఽఙ్గుష్ఠయో స్సక్తం నివీతం త్రివిధం స్మృతమ్.

తా॥ యజ్ఞోపవీతము మూత్రపురీషాది మనుష్య కార్యములందు రెండు భుజములం దుండునదిగను, మైథునసమయమున వీపుమీదుగ నుండున దిగను, ఋషి తర్పణమున చేతుల బొటన వ్రేళ్ళయందు కలిసినదిగ నుండవలయును.

## ఔశనసస్మృతి

అజినము, ఉత్తరీయము, ప్రధానోపవీతములు. తత్ స్థానాపన్నము, కార్పాససూత్రము(జందెము). దీనిని నిర్మించునపుడు నిశ్చలచిత్తుడై శుభలగ్న శుభవారములందు ప్రాత, స్సంగవ, మధ్యాహ్నకాలములలో నొక సమయమున స్నానమును జేసి పవిత్రమును ధరించి ఆచమించి పరిశుద్ధుడై దర్భలయందు గూర్చుండి వేదమును జదువుచు వసంతర్తువునందు పుట్టిన ప్రత్తిని నూరుమారులు వ్యాహృతుల బఠించుచు, నలకలుదీసి, త్ర్యంబక మంత్రముతో విత్తులనుదీసి, పురుషసూక్తముతో విడదీసి, యెండబెట్ట వలయును. పిమ్మట వెండితోగాని, రాగితోగాని చేయబడిన కదుళ్ళలో నొక దానితో నైనను, పూచిక పుల్ల వెదురు పుల్ల కదుళ్ళలో నొకదానితో నైనను తొంబదియారు బెత్తల దారమును దీయవలయును. దానికి మఱి రెండు రెట్లు దారమును గూర్చి మొత్తము కదురుతోగాని, ముగ్గురు బ్రాహ్మణుల ద్వారముగ గాని మూడు పేటలు గలదానినిగ జేసి దర్భలయందుంచి "పవమాన గాయత్రీ, ఆపోహిష్ఠా, ఇదం విష్ణు" మొదలగు మంత్రములతో అభిషేకించి యజ్ఞోపవీతమునుగా జేసి ప్రణవముతో ముడివేసి "అసునీతే" అను మంత్రముతో ప్రాణప్రతిష్ఠజేసి పూజించి ధరించవలయును. క్షురకర్మ, సూతకము, చండాలస్పర్శ, ఉపాకర్మ, యజ్ఞము ప్రాప్తించినపుడు, యథార్థ ముగా నుపవీతములను వదలి క్రొత్తవాటిని ధరించవలెను. శ్రోత్రియుడగు బ్రాహ్మణునిచే నిర్మింపబడినదియు, తాను నిర్మించుకొనినదియునైన యజ్ఞో

పవీతము ఉత్తమోత్తమము. యజ్ఞయాగాది కర్మానుష్ఠానము గలిగి, యాచకుడు గాని బ్రాహ్మణుడిచ్చిన సూత్రమును ధరించిన మాత్రమున సమస్త వేదపఠనము, సమస్త తీర్థయాత్రలు, సమస్త పుణ్యములు చేసిన ఫలము ప్రాప్తించగలదు. కుమారుని యుపనయనమునను, ఆబ్దికమునను, ఉపాకర్మోత్సర్గ సమయములందును, వేదవ్రతములయందును, గోదాన సమయమునను గురువులు మొదలగువారికి యజ్ఞోపవీతముల నిచ్చిన యెడల దేవతలు, పితృదేవతలు తృప్తి నొందుదురు. ఈ యాచారము పారస్కర సూత్ర గ్రంథములలో గనుపించుచున్నది. తనకు వడుకుటకు చేత గాన పుడు వడికించి దానము చేయవలయును. ఉత్తమ బ్రాహ్మణుని జూచిన మాత్రముననే యజ్ఞోపవీతము నిచ్చిన ద్విజునకు బ్రాహ్మణ్యము వృద్ధి పొందును. శ్రోత్రియుడు కాని వాడు ముఖ్యముగ మొదటినుండి మంత్ర సంస్కారముతో యజ్ఞోపవీతమును నిర్మింపవలయునుగాని, శ్రోత్రియుడు సంస్కారము చేయక వడికినను నది యుత్తమమే యగును. యజ్ఞోపవీతముల నమ్మిన వానికి, యజ్ఞోపవీతముల నిచ్చిన వానిని పూజించని వానికి నరకము. జీవితమధ్యమున రెండువేల యజ్ఞోపవీతములను దానము జేసినవాడు బ్రహ్మస్థాపకు డగుచున్నాడు.

నియమము లేక యజ్ఞోపవీతమును నిర్మించువాడు పాలెవానితో సమానుడు. నియమముతో వడికిన ఉపవీతమును, నియమములేని వానికిచ్చినవానికి బ్రహ్మహత్యా పాపము గలుగును. ఉపవీతముల నెప్పుడును వడికి బ్రాహ్మణుల కిచ్చువాడు బ్రాహ్మణ్యము నిలబెట్టినవాడేగాక, ఉత్తమ లోకముల నిప్పించువాడును అగుచున్నాడు. యజ్ఞోపవీతము నిచ్చిన వాడు సర్వమును ఇచ్చిన వాడే. యజ్ఞోపవీత దానమే మహాతపస్సు, మహాతీర్థసేవ, సర్వసత్కర్మాచరణము. యజ్ఞోపవీతమును దానముచేయు బ్రాహ్మణుడు సర్వసంపదల ననుభవించి ఉత్తమ లోకమును పొందగలడు. బ్రాహ్మణునకు బ్రహ్మత్వము, క్షత్రియునకు సామ్రాజ్యము, వైశ్యునకు ధనలక్ష్మి, తపస్వికి తపస్సు, యోగికి యోగము, యజ్ఞోపవీత మూలము లైనవి. ఇదియు అదియు ననవేల? సర్వ వేదములచే నిశ్చయింపబడిన పరమ ధర్మము యజ్ఞోపవీతమున నిమిడి యున్నది.

# భరద్వాజ స్మృతి

తన యింటియందుగాని లేక తన పొలమునందుగాని ఎచ్చటనైనను పరిశుద్ధ ప్రదేశమందు మోకాలిలోతు గుంటతీసి దానిలో ఆవుపేడను వేపి తెల్లమట్టి పోసి రెండు రెండు ప్రత్తి విత్తులను నాటవలయును. ప్రణవ ముతో నభిమంత్రించి ఆ పాదును "ఆపోవా ఇదగ్ం" అనుసూక్తముతో నీటితో తడుప వలయును. అవి మొలిచి పెరిగి పూపి కాపి ఫలించిన పిమ్మట పుణ్య నక్షత్ర వారములు గల స్వాధ్యాయ దినమందు ప్రాతఃకా లమున పవిత్ర జలముల స్నానముజేసి, బంగారు వెండి రాగి కదుళ్ళలో నొకదానిచేగాని, మట్టియుండతో గూడిన దర్భ కర్రతోగాని ప్రణవముతో గూడిన వ్యాహృతులతో మూడు ఆవృత్తులు గల తొంబదియారు బెత్తల దారమును దీయవలయును. పిమ్మట ప్రణవవ్యాహృతులతో తొమ్మిది పోగులు గల యజ్ఞోపవీతముగ జేసి, దానిని మోదుగు, మారేదు, చండ్ర, రావి మొదలగు యజ్ఞ సంబంధములగు చెట్లయొక్క ఆకులు గల సన్నని కొమ్మకు, కొమ్మ విరుగకుండా వ్యాహృతులతో కట్టవలయును. పిమ్మట దర్భల మీద వడ్లు పోసి, దాని మీద కూర్చునుంచి, కంకణము గట్టిన తామ్ర కలశమందు అక్షతలను సుగంధోదకముల నుంచి సూత్ర ముతో గూడిన కొమ్మను దీసికొనివచ్చి కలశమందుంచుకొని ప్రణవముతో గంధపుష్పాక్షతలతో పూజించి ధరించవలయును. వడుకు వప్పుడుగాని, మూడుపేటలుగ జేయుట కిద్దఱు పట్టుకొనునపుడుగాని మనుష్యులు, పురు గులు, జంతువులు క్రిందుగ వెళ్ళగూడదు. భోజనముచేసి నిర్మించిన సూత్రమును, ఎలుకలు కొట్టినదియును కర్మార్హము గాదు. అపరి- శుద్ధులు తాకినను, తెగిపోయినను, క్రిందకు జారినను వదలిపెట్టి క్రొత్త దానిని ధరించవలెను.

యజ్ఞసూత్రము తెల్ల ఆవకాయతో సమానమైన లావు గలదిగ నుండ వలయును. వెంట్రుకలు చిక్కుకొన్నచో తీసివేయవలయును. నివీతముగ జేసికొనక, చెవికి జుట్టుకొనక మలమూత్రముల విడచినను, ఉపవీతమున నొక పోగు తెగినను దానిని విడువవలయును. యజ్ఞోపవీతపు దారమునకు తొమ్మిది ఆవృత్తులు (మడతలు) ప్రమాణమై యున్నవి.

## ధర్మప్రవృత్తి

శ్లో॥ యజ్ఞోపవీతం ధర్తవ్యం శ్రావణ్యాం గురుశుక్రయోః,
బాల్యే వా వార్ధకేఽవాపి నిత్యవ త్కర్మచోదితమ్.

తా॥ గురు శుక్ర మౌఢ్యాది విచారము లేకుండగనే శ్రావణ పూర్ణిమ యందు యజ్ఞోపవీత ధారణమును సంధ్యావన్దనాది నిత్యకర్మలను (శాస్త్రము) విధించుచున్నది.

శ్లో॥ మేఖలా మజినం దణ్డ ముపవీతం కమణ్డలుమ్,
అప్సు ప్రాస్య వినష్టాని, గృహ్ణీ తాన్యాని మన్త్రితః.

— (మ. స్మృ. ౨-౬౪).

తా॥ చెడిపోయిన మేఖలను, అజినమును, దండమును, ఉపవీతమును, కమండలువును, నీటియందు పారవైచి, క్రొత్తవాటిని మన్త్రములతో ధరించవలయును.

శ్లో॥ ఉపాకర్మణి చోత్సర్గే గతే మాస చతుష్టయే,
నవ యజ్ఞోపవీతాని ధృత్వా జీర్ణాని సంత్యజేత్.

— (శిఖాయజ్ఞోపవీత మీమాంస).

తా॥ ... .... యజ్ఞోపవీతముల ధరించిన పిమ్మట నాల్గుమాసములు గడచిన యెడల తిరిగి క్రొత్తవానిని ధరించవలయును.

"యజ్ఞోపవీతం శిరసి, కర్ణే వా కృత్వా" — (బో.గృ.శే. ౧౧-౪).

తా॥ మూత్ర పురీషాది శౌచ కర్మలందు యజ్ఞోపవీతమును తలకుగాని, కుడిచెవికిగాని చుట్టుకొనవలయును.

"శిరః ప్రావృత్య వాససా" ఆ సమయమున ఉత్తరీయమును తలకు జుట్టుకొనవలయును.

"త్రిగుణం తద్గ్రన్థియుక్తం వేదప్రవర సమ్మితమ్"

— (శి.యు. మీమాంస).

తా॥ యజ్ఞోపవీతము మూడుపేటలు గలిగి, తన వేదముతో, తన గోత్ర ప్రవరలతో సమానములగు ముడులు గలదిగా నుండవలయును.

శ్లో॥ హంసస్య పరమ హంసస్య న తత్సూత్రం ప్రచక్షతే,
ఏకం కుటీచకాదీనాం యజ్ఞసూత్ర ముదీరితమ్.

— (ఔశనస స్మృతి).

తా॥ హంస, పరమహంస సన్న్యాసులకు యజ్ఞోపవీత ముండదు. కుటీచక బహూదకుల కొక యజ్ఞోపవీత ముండును.

జందెము మిక్కిలి లావుగ నున్న కీర్తిని హరించుననియు, మిక్కిలి సన్నగ నున్న దారిద్ర్యము గలుగుననియు, బ్రహ్మసూత్ర ధారణము ఓజస్సును, బ్రహ్మవర్చస్సును కలుగజేయుననియు—

శ్లో॥ యశోహర మతిస్థూల, మతిసూక్ష్మం ధనాపహమ్,
ఔజస్యం బ్రహ్మవర్చస్యం బ్రహ్మసూత్రం తథోదితమ్.

— (స్మృతి రత్నమాలయందు స్మృతిప్రకాశము).

మేధాతిథి యజ్ఞసంఖ్యనుబట్టి యజ్ఞోపవీతముల ధరించవలయు ననును గాని అట్లనుటలో ప్రమాణము గనుపించదు.

శ్లో॥ యజ్ఞోపవీత స్యోత్పత్తిం జానాతి బ్రాహ్మణో న చేత్,
స వై వహతి భారాయ పుస్తకాని యథా వృషః.

— (సంస్కారరత్నమాల).

శ్లో॥ య ఏతన్నాభిజానాతి యజ్ఞసూత్ర సముద్భవమ్,
వేదోక్తం నిష్ఫలం తత్ర స్నాన దాన జపాదికమ్.

— (స్మృతిముక్తాఫలము).

తా॥ యజ్ఞోపవీతముయొక్క ఉత్పత్తి దెలియని బ్రాహ్మణుడు ఎద్దు పుస్తకముల బరువును మోసినట్లు యజ్ఞోపవీతమును ధరించుచున్నాడు. యజ్ఞోపవీతముయొక్క ఉత్పత్తిని దెలియనివాని వేదోక్తమగు స్నానము దానము జపము మొదలగు సత్కర్మలు నిష్ఫలము లగుచున్నవి.

ఇక స్త్రీ యజ్ఞోపవీతవిషయము విచారింపబడుచున్నది.

## స్త్రీ యజ్ఞోపవీతము

ఇంతవఱకు చేయబడిన విమర్శనమున స్త్రీలకు యజ్ఞోపవీతము ఉత్తరీయరూపముగగాని, సూత్రరూపముగగాని గనుపింపదు. మనలో స్త్రీ దేవతలకు షోడశోపచారములయందు యజ్ఞోపవీత సమర్పణ మాచారమున నున్నది. స్త్రీలచే తత్కర్తృక శ్రాద్ధములందుమాత్రము తాత్కాలికముగ నొకగుడ్డ ధరింపవలసినదిగ ధర్మశాస్త్రములలో గన్పట్టుచున్నది; కాని, ఇచట గమనింపదగిన విశేషమొకటి యున్నది.

గోభిలాచార్యుడు "ప్రావృతాం యజ్ఞోపవీతినీ మభ్యుదానయన్ జపే 'త్సో మోద ద్గన్ధర్వాయే'తి (గో.గృ. ౧-౧-౧౬) భా॥ ప్రావృతాం=కృతో త్తరీయాం, కథం ప్రావృతాం?, యజ్ఞోపవీతినీం తా మివేత్యర్థః" అని పురుషులకువలె స్త్రీకి వివాహమందు విన్యాస విశేషముతో నుపవీతముగ నుండు ఉత్తరీయమును విధించుచున్నాడు. ఇది సర్వదేశీయుల యాచర ణములో నుండి ఆంధ్రులచే వల్లె యనియు, వల్లెవా టుత్తరీయమనియు వ్యవహరింపబడుచు ధరింపబడుచున్నది. ఇది శ్రౌతమునగూడ పత్నీ దీక్షయందు గలదు. దీనినిబట్టి పురుషులకువలె స్త్రీకిని ఉపాసనాది ధర్మములందు యజ్ఞోపవీత మావశ్యకముగాన కవికులశేఖరుడగు కాళిదాసు వ్రతస్థయైన పార్వతీదేవిని—

శ్లో॥ కృతాభిషేకాం హుతజాతవేదసం
త్వగుత్తరాసంగవతీ మధీతినీమ్,
దిదృక్షవ స్తా మృష యోఽభ్యుపాగమన్
నధర్మ వృద్ధేషు వయః సమీక్ష్యతే.

— (కుమారసంభవము సర్గ ౫-౧౬).

— అని నారతో నిర్మింపబడిన యుత్తరీయోపవీతము గలదానినిగ వర్ణించెను.

ఇందువలన స్త్రీలకును శాస్త్రసిద్ధమగు యజ్ఞోపవీత మున్నదనియు, అది పురుషులకువలెనే స్త్రీలకు నుత్తరీయమే యనియు నిర్ణీత మగుటయేగాక, వ్రతస్థులకు నారచీరల ప్రాశస్త్యము గూడ వెల్లడియగుచున్నది.

విశేషమేమన? ఈ విమర్శవలన ఆన్ధ్రపురన్ధ్రీమణుల యెడమ పయట దేవవిప్రాప్తమై భాగ్య విశేషద మగుటచే వాన్ధ్రస్త్రీధర్మము కొని యాడదగియున్నది. ఇప్పటికి యథాశక్తి యజ్ఞోపవీత ధర్మ విశేషములు తెలియజేయబడినవి.

## ఉపవీత ప్రాచీనావీత నివీత కర్తవ్యములు

౧. "ప్రాగపవర్గా ణ్యుదగపవర్గాణి వా యజ్ఞోపవీతీ దైవాని కర్మాణి కరోతి" — ఆప.శ్రౌ.ప. ౨-౧౫.

"యజ్ఞోపవీతివా" — ఆప.గృ.ప. ౧.౧.3.

"ఉపాసనే గురూణాం వృద్ధానా మతిథీనాం హోమే జప్యకర్మణి స్వాధ్యాయే చ యజ్ఞోపవీతీ స్యాత్".

— ఆప.ధ. ౧.౧౫-౧.

"... ఉపవీతం దేవానా మిత్యమృతానామేవేద ముక్తం భవతి" — బో.గృ.ప. ౨-౨-౧౧.

శ్లో॥ అగ్న్యగారే గవాంమధ్యే బ్రాహ్మణానాం చ సన్నిధౌ,
స్వాధ్యాయే భోజనే చైవ దక్షిణం బాహు ముద్ధరేత్.

— బో.ధ. ౨-3-3.

శ్లో॥ ఉత్తరం వాసః కర్తవ్యం పఞ్చస్వేతేషు కర్మసు,
స్వాధ్యాయోత్సర్గ దానేషు భోజనాచమనయో స్తథా.

— బో.ధ. ౨-3-38.

శ్లో॥ అగ్న్యగారే గవాం గోష్ఠే హోమే జప్యే తథైవ చ,
స్వాధ్యాయే భోజనే నిత్యం బ్రాహ్మణానాం చ సన్నిధౌ.

శ్లో॥ ఉపాసనే గురూణాంచ సన్ధ్యయో ప్పాధుసంగమే,
ఉపవీతీ భవేన్నిత్యం విధి రేష సనాతనః.

— కూర్మపురాణ ముత్తరార్ధము - శ్లో॥౧౨-౧౩.

తా॥ దైవికములగు యజ్ఞాదులందునను వివాహాది గృహ్య కర్మలందును గురువులను, పెద్దలను, అతిథులను సేవించునపుడును, పితృహోమము కంటె నితరములగు హోమ సమయములందును, జప, భోజన, ఆచమన, వేదపఠన కాలములందును, గోశాలయందును, బ్రాహ్మణ సమీపమందునను దానము చేయునపుడును, సన్ధ్యోపాసనా సమయమునను, సన్న్యాసులు మొదలగువారి సన్నిధానమునను ఉపవీతియై యుండవలయును.

౨. "ప్రాచీనావీతీ ప్రసవ్యం దక్షిణాపవర్గాణి పిత్ర్యాణి".

— ఆప.శ్రౌ.ప. ౨-౧౬.

"ప్రాచీనావీతినా" — ఆప.గృ.ప. ౧.౮.

"... ... ప్రాచీనావీతం పిత్ర్యాణామితి మృతానా మిత్యేవేదముక్తం భవతి". — బో.గృ.ప. ౨-౨-౪.

"ఏతేన వైశంపాయనాదయో వ్యాఖ్యాతాః" — బో.గృ.ప. ౨-౨-౮.

"తేషాం సోమః ... ... పితరః" — బో.గృ.ప. ౨-౨-౯.

తా॥ పితృయజ్ఞ, తర్పణ, హోమ, పిండ, శ్రాద్ధరూపములగు సర్వపితృకార్యములందును ప్రాచీనావీతియై యుండవలయును.

3. అథ నివీతకార్యాణి-ఋషీణాం తర్పణం, వ్యవాయః, ప్రజాసంస్కారోఽన్యత్ర హోమా, న్మూత్ర పురీషోత్సర్గః, ప్రేతోద్వహనం యాని చాన్యాని మనుష్యకార్యాణి కంఠేఽవసక్తం నివీతమితి. — బో.గృ. ౨.౨.౬.

తా॥ ఋషితర్పణము, మైథునము, హోమముకంటె నితరమగు ప్రజాసంస్కారము, మూత్రపురీషోత్సర్గము, ప్రేతోద్వహనము ఇతరములగు

అభ్యంజనాది మనుష్య కార్యములు మొదలగు వాటియందు నివీతిగా నుండవలయును.

ఇందు బోధాయనోక్త నివీత కర్తవ్యకర్మలలో ఋషితర్పణము మాత్రము వైదికకర్మయై నివీతముతో జేయదగియున్నది. ఆశ్వలాయన మహర్షి బ్రహ్మ యజ్ఞానంతర దేవర్షి పితృతర్పణ సందర్భమున "దేవతాంస్తర్పయతి, ప్రజాపతి ర్బ్రహ్మే ... ... భూతాన్యేవ మన్త్రాని (గృ.४-४-౧) అను సూత్రముచే నుపవీతముతో దేవతర్పణమును జెప్పి "అథ ఋషయ శ్శతర్చినో మధ్యమా గృత్సమద ... ... మహాసూక్తా ఇతి — (గృ.४-४-౨) అను తరువాతి సూత్రముచే ఋషితర్పణమును విధించెను. కాని నివీతమును విధింవలేదు.

పిమ్మట "ప్రాచీనావీతీ — (గృ. ४-४-3) అను సూత్రము నుప క్రమించి "సుమంతు జైమిని వైశంపాయన ... ... ఆచార్యా స్తే సర్వే తృప్యన్త్వితి" (గృ.४-४-४), "ప్రతిపూరుషం పితౄాం స్తర్పయిత్వా ... ... దక్షిణా" (గృ. ४-४-౫) అను సూత్రములచే ప్రాచీనావీతముతో తర్పణము జేయదగినవారిని నిర్దేశించెను.

ఇందువలన నీ యాశ్వలాయన మతమున ఋషితర్పణ ముపవీ తముతోనే జేయదగియున్నదని చెప్పకనే తెలియుచున్నది. మఱియు నీ యాశ్వలాయన మతమున నుపాకర్మాదులయందును నివీతవిధి కనుపింపదు. పరాశరమాధవీయమున ఋషితర్పణమును నివీతముతో జేయవలెననెడి వచ నము లనేకములు గలవు. విద్యారణ్యభాష్యమున ఋషితర్పణాదికమును నివీతముగ జేయవలయునని యున్నదని తెలిసియే యున్నది. ఇట్లుబోధాయ నాదులచే ఋషితర్పణమున విధింపబడిన నివీత మాపస్తంబ సూత్రమునను మఱికొన్ని సూత్రములందును కనిపించదు. మఱియు ఆపస్తంబ మతమున ఉపాకర్మ, మనుష్య యజ్ఞములందును నివీతవిధి కనుపింపదు. ఇందువలన ఆపస్తంబమతమున వైదికకర్మయందు నివీత కార్యము లేదనుకొనవలసి వచ్చుచున్నది.

ద్రాహ్యాయణ వృత్తికారుడు "అస్మిఞ్ఛాస్త్రే నివీతినా కృత్యం నాస్తీతి".

తా॥ ఈ గృహ్యశాస్త్రమున నివీతముతో పనిలేదు గావున -- అని ఉద్ఘాటించినట్లు మనమును ఆపస్తంబ మతమున నివీతకార్యము లేదు గావుననే నివీతమును విధింపలే దనుకొనవచ్చును. అటుగాకున్న దేవపిత్రుకర్మలందు ఉపవీత ప్రాచీనావీతములు విధించిన ఆపస్తంబమహర్షి ఉపాకర్మాదులందు లేకున్న ప్రత్యవాయ జనకమగు నివీతమును విధించకపోవునా? వ్యాఖ్యాతలైతే ఋషితర్పణాదులందు ఇతర స్మృతుల ననుసరించి నివీతమును వ్రాయుచున్నారు.

ఆశ్వలాయనమహర్షి పై కార్యముల నుపవీతముతో జేయవలయునను చున్నను, వ్యాఖ్యాతలు పరిశిష్టమున్ను, నివీతవిధిని కల్పించుచున్నవి. ఇది యుక్తము గాదు. నివీతశాస్త్రమునకు బోధాయన మతమందు చరితార్థత గలదు.

బోధాయనాపస్తంబు లిరువురు యాజుష్కులేయైనను అనేకవిషయములలో మతభేదము గలదు. బోధాయనమహర్షి దివ్యులగు సోమాది పితృదేవతల తర్పణాది క్రియలయందు ప్రాచీనావీతమును విధించు చున్నాడు. ఆపస్తంబ మహర్షి ఆ దేవతలకే "అధ్వర్యు రుపవీతీ దక్షిణం జాన్వాచ్య ... ... సోమాయ పితృపీతాయ ... ... జుహోతి" (ఆప.ధ.సూ. ౮-౨) అని ఉపవీతముతో హోమమును విధించుచున్నాడు. ఆపస్తంబులు ఋష్యర్చనాదికము ఉపవీతముతోనే జేయవలయునను విషయము "ఉపాసనే గురూణా" మను సూత్రముచేత గతార్థ మగుచున్నది. కావున ప్రత్యేక నివీత విధాయక శాస్త్రమునకు తావు గన్పట్టదు. అందువలన ఆపస్తంబాశ్వలాయన సూత్రములవారును, ఋష్యర్చనమున నివీతవిధి లేని మిగిలిన సూత్రములవారును ఋషిపూజను మనుష్యయజ్ఞమును నుపవీతయుక్తులై చేయుట యుక్తమని తలచెదను.

పై విషయమున విమర్శక పండితులు ప్రమాణము.

## మృగశీర్ష

### శ్రీ లోకమాన్య బాలగంగాధర తిలక్

ఉపవీతశబ్దము వే=(నేయుట) అను ధాతువు నుండి పుట్టినది కనుక దీనికి "వస్త్రము" అని యర్థమే యగునుకాని, "దారము" అని అర్థము కాజాలదు ... ... <u>యజ్ఞోపవీత మనునది వస్త్రమే గాని దారము గాదు.</u> తై॥సం॥ (౧౧-౬-౧౧). (నివీతం మనుష్యాణామ్)లో నివీత ప్రాచీనావీతోప వీతములనెడి మూడు యజ్ఞోపవీత ధారణములు వర్ణింపబడినవి. ఈ మూడు విధములు యజ్ఞోపవీతమునకు వర్తించవనియు, యజ్ఞకర్మ చేయునపుడు ప్రతివారును ధరింపవలసిన లేడి చర్మమునకు గాని, వస్త్రమునకుగాని వర్తింపవలయు ననియు మీమాంసకులు తలంచుచున్నారు. కనుక పూర్వ కాలమున బ్రాహ్మణులు జింక చర్మమునో లేక వస్త్రమునో ... ... కట్టుకొను చుండెడివారే ... ... ఉపనయన కర్మలో నీ దారముమాట ఎచ్చటను జెప్పబడలేదు. ఆశ్వలాయన గృహ్య సూత్రములు (ఖం.౧౯ సూ.౮-౧౦-౧౨)లో అజినము, మేఖల, దండము — ఈ మూడే చెప్పబడినవి గాని, దారపు రూపమగు జన్నిదము ఎచ్చటను చెప్పబడలేదు. కాని, యీకాలములో నీ దారమే యుపనయన కర్మకు ప్రధానాంగముగ గన్పట్టుచున్నది. అయినను వస్త్రము ధరించు ఆచారమును మాత్రము మనము పూర్తిగ వదలలేదు. పితరులకు అపరకర్మ చేయునపుడు ఈ మామూలు జన్నిదమునకు తోడుగ గుడ్డముక్కను జింపి జన్నిదముగ ధరింతుము. ఇది పైన వివరించిన ప్రాచీనాచారముయొక్క చిహ్నము. బ్రాహ్మణుడు ధరింపవలసిన మూడు జన్నిదములలో నొకటి పై బట్ట లేనపు దుత్తరీయమునకు ప్రత్యామ్నాయమని దేవలుడు తలంచుచున్నాడు. "తృతీయ ముత్తరీయార్థే వస్త్రాభావే తదిష్యతే" — ఇది పూర్వాచారమును సూచించు చిహ్నముగ నున్నది. యజ్ఞోపవీత మనునది ... ... వస్త్రముగా నుండెడిది. ... ... నివీతి యనగ మెడలో తావళమువలె వ్రేలాడునట్లు — అని కొందఱు వ్యాఖ్యానమును జేసిరి. కాని, కుమారిలభట్టుని తంత్రవార్తికమును జూచినచో "నివీతి" అనగా నడుముచుట్టు కట్టుట అను

అర్థముగూడ గలదు. నడుమును బిగించి కట్టిన నే పనియైన జేయుటకు మిక్కిలి అనుకూలముగ నుండునని కుమారిలభట్టు వ్యాఖ్యానమును గూడ జేసెను. బ్రహ్మసూత్ర శాంకర భాష్యమునకు వ్యాఖ్యానమును వ్రాయుచు ఆనందగిరి, గోవిందానందు లిరువురుగూడ నీ విధముననే చెప్పిరి.

"నివీతం కేచి ద్లవేణికాబంధం స్మరంతి, కేచి త్పునః పరికరబన్ధం. తత్ర లవేణికాబంధో యుద్ధాదన్యత్ర న ప్రాప్నోతి; పరికరబన్ధస్తు సర్వకర్మ స్వవ్యగ్రతాకరత్వా త్ప్రాప్తః." ఇతి.

# యజ్ఞోపవీత తత్త్వము

ఆచారభూషణమున అచ్యుత విరచిత శ్లోకద్వయము

శ్లో॥ దేహో మానుష ఏవ షణ్ణవతిసంఖ్యాకై ర్మితోఽప్యఙ్గులైః
వేద స్త్వఙ్గులి పర్వసు ద్విజవరై స్సంసూచ్య సంపఠ్యతే,
తద్రూపో రవి రేష మేరు మనిశం సంఖ్యాంకరో త్యత్ర త
త్కార్యా షణ్ణవతి స్త్రిధోర్ధ్వవృ దియం శ్రీ యజ్ఞసూత్రే ద్విజైః.

అర్థము॥ మానుషః = మనుష్య సంబంధమగు, దేహ ఏవ = దేహమే, షణ్ణవతిసంఖ్యాకైః = తొంబదియారు సంఖ్యలుగల (తొంబదియారైన), అఙ్గులైః = అంగులములతో, మితః = కొలువబడినది. అనగా మనుష్య దేహ పరిమాణము తొంబదియారు అంగుళములు. ద్విజవరైః = బ్రాహ్మణుల చేత, వేదస్తు = వేదమైతే, అఙ్గులిపర్వసు = వ్రేళ్ళ కణుపులయందు, సంసూచ్య = పద వాక్య క్రమముచే సూచింపబడి (లెక్కగొని), సంపఠ్యతే = పఠింపబడుచు న్నది. తద్రూపః = ఆ వేదస్వరూపుడైన రవిః = సూర్యుడు, అనిశం = ఎల్లపుడు, మేరుం = మేరుపర్వతమును, సంఖ్యాంకరోతి = తొంబదియారు పరిస్పందము లతో ప్రదక్షిణమును చేయుచున్నాడు. తత్ = ఆ కారణమువలన, ద్విజ వరైః = బ్రాహ్మణులచేత, అత్ర = ఈ యజ్ఞసూత్రమందు, ఊర్ధ్వవృత్ = పైకి పురివేయబడిన, త్రిధా = మూడు ఆవృత్తులు గల, ఇయం = ఈ షణ్ణ వతిః = తొంబదియారు(బెత్తల) సంఖ్య, కార్యా = చేయదగినది.

తా॥ మానవశరీరము వారి వారి అంగుళములతో తొంబదియా రంగుళ ములు పరిమాణము గలది. బ్రాహ్మణులు వేదమును వ్రేళ్ళ కణుపులయందు పదవాక్యముల లెక్కించి పఠించుచున్నారు.

వేదత్రయాత్మకుడగు సూర్యుడు రాత్రిం బవళ్ళు మేరువును ప్రదక్షి ణముచేయునపుడు నాల్గుదిక్కులనెడి సమకోణములకు నాల్గు యిరువది నాల్గులు తొంబదియారు పరిస్పందములు ఒక వర్తుల రేఖవంటి ప్రదక్షిణ కాలములో తొంబదియారు సంఖ్యనే ఆవృత్తి చేయుచున్నాడు. ఇందు వలన బ్రాహ్మణులు యజ్ఞ సూత్రమందుగూడ తొంబదియారు బెత్తల పరిమాణమునే చేయవలయును.

శ్లో॥ కార్పాసైః కిల సప్తవింశతిమితై స్సూత్రై స్త్రివృద్గ్రంథితం
తల్లిఙ్గం ద్విజరాజతైక ఘటకం యజ్ఞోపవీతం ద్విజైః,
సంధార్యం శిఖయా సహ న్యసన మశ్విన్యాది బృన్దోపమమ్
నైర్మల్యా ద్విరహేఽతితాపజననా ద్యోగే సుఖాప్తేరపి.

అర్థము॥ సప్తవింశతిమితైః=ఇరువదేడగు, కార్పాసైః సూత్రైః = ప్రత్తి దారములచేత, త్రివృత్=(తొమ్మిదేసి పోగులు) మూడు పేటలు గలదిగ, గ్రన్థితం=ముడివేయబడినదియు, నైర్మల్యాత్=తెల్లనిదగుటవలనను, విరహే=లేకపోయిన, అతితాప జననాత్ = తాపత్రయము, సంతాపము పుట్టుటవలనను, యోగే = సంప్రాప్తియందు, సుఖాప్తేరపి=అదృష్టసుఖము శారీరక సుఖములయొక్క ప్రాప్తివలనను, అశ్విన్యాది బృన్దోపమమ్=అశ్విని మొదలగు నక్షత్రసమూహముతో పోల్చదగినదియు, (తెలుపుదనము, యిరువదేడు దారములు గలదనుట) ద్విజరాజతైక ఘటకం=బ్రాహ్మ ణత్వమును క్షత్రియత్వమును వైశ్యత్వమును ముఖ్యముగ సంపాదించున దియైన (చంద్రునివలె ప్రకాశింపజేయునది), లిఙ్గం=ద్విజ చిహ్నమైనదైన, తత్=ఆ ప్రసిద్ధమైన, యజ్ఞోపవీతం=జందెము, ద్విజైః=బ్రహ్మ క్షత్రియ వైశ్యులచే, శిఖయాసహ=శిఖతో గూడ, న్యసనం=విధిపూర్వక స్థాపనము గలదై, సంధార్యం=ధరించదగినది.

తా॥ యజ్ఞోపవీతము ఇరువదేడు పోగులును, మూడు పేటలు (భాగములు) గ గలదైయుండి అశ్విని మొదలగు నిరువదేడు నక్షత్రసమూహ మువలె నుండుచు మూడు వర్ణములవారికి ద్విజత్వమును కూర్చుచున్నట్టిది. తెలుపుదనములోను, ఉన్నపుడు సంతోషమును, లేనపుడు సంతాపమును గలిగించుటలోను చంద్రునితో పోల్చదగినది. (అనగా నది యున్నపుడు సత్కర్మానుష్ఠానమువలని సంతోషమును, అది లేనపుడు ఆ సంతోషము లేక పోవుటయు సంభవించుననుట). అందువలన యజ్ఞోపవీతమును శిఖతో గూడ ధరించవలయును.

# యజ్ఞోపవీత తత్త్వదర్శన సంగ్రహము

యజ్ఞోపవీతము పరమపవిత్రమైన వైదిక కర్మానుష్ఠానమునకు ముఖ్య సాధనమైనదనియు, ధరించినమాత్రమున మహాఫలము నిచ్చెడిదనియు యజ్ఞోపవీతత్త్వము విచారించబడుచున్నది.

యజ్ఞోపవీతమన దేవతాప్రీతికొఱకు జేసెడి కర్మలందు ఎడమభుజమును, కుడిచేతిక్రింది భాగమును కప్పుచుండు వస్త్రమునకు గాని, లేడిచర్మమునకుగాని, లేదా సూత్రము (దారము)నకు గాని పేరు.

ఇట్లు ధరించుట దేవచిహ్నమగును గాన యజ్ఞోపవీతమునకు దేవలక్ష్మ (దేవచిహ్నము) అను పేరు గలిగినది. అనగా నది దేవతల గురుతు. అట్టి గురుతును ధరించుటవలన మేలు గలుగుటయే గాక, భగవద్గీత యందు జెప్పబడిన అన్తఃకరణపారిశుద్ధ్యము మొదలగు దైవగుణములు సైతము గలుగును. దానిని శివుడుగూడ మంగళముకొఱకు ధరించుచున్నాడనియు, ధరించినందువలన మంగళాచారము గలవాడనియు శ్రుతి చెప్పుచున్నది. కావున దానిని ధరించి చేయునట్టి సత్కర్మలన్నియు శుభము నిచ్చెడి వగుచున్నవి. అట్టిదానిని సర్వదా ధరించుటవలన శుభములకు ఏలాటి కొఱతయు నుండదు. అందువలన ప్రతి భారతీయ వ్యక్తియు ఈ దైవ చిహ్నమును ధరించి తన భారతీయ విశిష్టతను ప్రకాశింప జేయువలయును.

ఏ వైదికకర్మానుష్ఠానమైనను యజ్ఞోపవీతము లేక జరుగదు. ఈ యజ్ఞోపవీతముయొక్క ఆవశ్యకతను గుఱించి వేదమిట్లు చెప్పుచున్నది. "పూర్వమున దేవతలు స్వర్గమును సంపాదింపదలచినవారై యజ్ఞోపవీత మును ధరించి యజ్ఞమును జేసి స్వర్గమును పొందిరి. ఆ కోరికతోనే రాక్షసులును, అతిసాహసముతో యజ్ఞోపవీతము లేకుండ యజ్ఞమును జేసినందున స్వర్గమును పొందలేకపోయిరి. అందువలన వేదాధ్యయనము (సంధ్యావందనము, హోమము, దేవదర్శనము, గురువందనము) మొద లగునవి యజ్ఞోపవీతము గలిగి చేయవలయును. యజ్ఞోపవీతము లేక చేసిన కర్మలు వ్యర్థము లగును. యజ్ఞోపవీతమునకు ముఖ్యములగు వస్తువులు జింక చర్మము, వస్త్రమును". ఈ రెండు వస్తువులు వేరగునవి గాక, ఉపనయన స్నాతకముల అగ్ని సమీపమున నాసాదించి ధరించదగిన వస్తువులలో నుత్తరీయములను పేరులతో ప్రాప్తించి యజ్ఞోపవీతక్రియను నిర్వహించుచున్నవిగాన యజ్ఞోపవీతములను పేరునుగూడ పొందుచున్నవి.

ఈ యజినమునకు వస్త్రమునకు బదులు ఆపస్తంబాది ఋషులు యజ్ఞసూత్రమును విధించిరిగాన, అది యెల్లపుడు మెడలోనుండి అవి లేని లోపమునుండి కాపాడుచుండును. అవి లేనపు డిదియే కేవలము కర్మాను ష్ఠానమునకుగూడ తోడ్పడుచుండును. ఈ విషయమును సూత్రకారులలో నాపస్తంబమహర్షి బాగుగ తెలియపఱచియున్నాడు. ఇట్టి విషయము తెలియని వారు ఆపస్తంబమహర్షి యజ్ఞోపవీతమును గూర్చి చెప్పలేదనుచున్నారు. పారస్కరసూత్రకారాదుల వ్యాఖ్యాత లిట్లే యనుచున్నారు. బోధాయన మతమున ని ట్లుత్తరీయము నిమిత్తమై ప్రాప్తించిన యజ్ఞసూత్రముగాక, ఉపనయనాదిలో స్వతంత్రముగ ప్రాప్తించెడి సూత్ర మొకటి యున్నది. దీనిని పురుషార్థ సూత్ర మందురు. పురుషార్థ సూత్రమనగా ధరించిన మాత్రముననే స్వయముగ మహాఫలము నిచ్చెడిదని యర్థము. దీనిని ఆపస్తంబమహర్షి చెప్పనప్పటికిని ప్రస్తుతమున ఆపస్తంబీయులు ధరించుచు న్నారు. ఆ మతమున నిది యుండ, అజినము, వస్త్రము లేకపోయినపుడు వాటి నిమిత్తమై సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలయందు మఱియొక సూత్ర మావశ్యకమై యుండును. కేవల పురుషార్థ సూత్రము కర్మ

కుపయోగించదు. ఆపస్తంబ మతమున ఉత్తరీయార్థ సూత్రము నిత్యముగ నుండునుగాన నది యొకటే పురుషార్థము కర్మార్థము నగును.

యజ్ఞోపవీత ధారణమువలన రాక్షసబాధ యుండదనియు, ద్విజత్వము స్థిరమై యుండుననియు స్మృతులు చెప్పుచున్నవి. ఉత్తరీయార్థముగాక కేవల పురుషార్థము నిమిత్తము ధరించబడిన యజ్ఞోపవీతమునే ప్రధానముగ జేసికొని ఆపస్తంబాదు లుపవీతమును చెప్పలేదనెడి వాదములు, యజ్ఞసూత్రమే ప్రధానమైనదను వాదములు పూర్తిగా నిరసింపబడినవి. ఇట్టి చర్మము, వస్త్రము ప్రధానోపవీతములను విషయమున శాపదగ్ధుడగు భూరిద్యుమ్నుడను రాజు రాక్షసత్వావేశమున నివ్వరిధాన్యముల దెచ్చుకొను బ్రాహ్మణుల జంపి వారి మెడలలో నుండు అజినములతో గూడిన యుపవీతముల జూచి పశ్చాత్తాపపడెనని పద్మపురాణములోను, అరణ్యవాసమున శ్రీరామచంద్రుడు నారదగు నుత్తరీయమును యజ్ఞోపవీతముగ ధరించి సాయంకాల సంధ్య నుపాసించెనని శ్రీమద్రామాయణములోను గలదు. మఱియు కుమారసంభవమున మహాకవి కాళిదాసు తపస్సులో నున్న పార్వతీ దేవిని నార యుత్తరీయము నుపవీతముగా ధరించియున్నదని వర్ణించెను. పితృ మానుష కర్మలయందు దప్ప, ఉత్తరీయము నుపవీతముగనే ఎల్లపుడు ధరించవలయును.

అజినోత్తరీయ మహిమలను వాటి ధారణమంత్రము లిట్లు బోధించుచున్నవి. 'అజినోపవీతమును ధరించినవాడు సూర్యుని ప్రత్యక్షము జేసికొనును. అన్నసమృద్ధి గలవాడగును. సూర్యునకు వస్త్రోపవీతమును నిర్మించి యిచ్చుటవలన దేవతలు గొప్పమహిమను పొందిరను వృత్తాంతము వస్త్రోపవీత ప్రదానముయొక్క మహిమను వెల్లడిచేయుచున్నది.

ఔశనస స్మృతి యిట్లు చెప్పుచున్నది.

పూర్వమున బ్రహ్మదేవుడు యజ్ఞోపవీతముతో బ్రాహ్మణ్యమును సృజించినందున బ్రాహ్మణుడు బ్రాహ్మణత్వసిద్ధికొఱకై యజ్ఞోపవీతమును ధరించవలయును. బృహస్పతి వస్త్రమునే జన్నిదముగ వేసికొనెను.

మఱియు ఆయన సోమునకు అజినమును జన్నిదముగ వేసెను. అందువలన ద్విజాలు ఎల్లపుడు వస్త్రయజ్ఞోపవీతములతోనుండి సర్వవైదిక కర్మలను జేయవలయును. ఉపవీతముగా జేయుదగిన వస్తువులు అజిన వస్త్రములు. ఈ రెంటిని ద్విజుడు ఎడతెరపిలేక ధరించుట అశక్యమని తలచి ఆ బ్రహ్మదేవుడు ఆలోచించి వీటికి బదులు యజ్ఞసూత్రము ధరించదగినదని నిశ్చయించుకొని సమస్త వైదిక కర్మలకు పరమ సాధనమైన యజ్ఞసూత్రమును నిర్మించెను.

కూర్మపురాణముగూడ నిట్లే బ్రహ్మచారి ప్రకరణమున పురుషార్థ సూత్రమును జెప్పి, పిమ్మట శిఖను, కట్టుబట్ట(పంచ)ను జెప్పి తరువాత—

శ్లో॥ ఉత్తరంతు సమాఖ్యాతం వాసః కృష్ణాజినం శుభమ్,
అభావే దివ్య మజినం రౌరవం వా విధీయతే. ॥౯॥
ఉద్ధృత్య దక్షిణం బాహుం సవ్యే బాహౌ సమన్వితమ్,
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ॥౧౦॥

అని బ్రహ్మచారికి ఉత్తరీయమగు అజినముతో సవ్యాపసవ్యములు చెప్పుచున్నది.

శంకరభగవత్పాదులును బృహదారణ్యక భాష్యమున ప్రధానములగు అజిన వస్త్రములనే యుపవీత ద్రవ్యములుగ విధించు శ్రుతులనే ప్రమాణ ముగ గైకొనియున్నారు.

ఈ యజినమునకు, నుత్తరీయమునకు బదులు సూత్రమే గాక, రాజులకు జనుపనార జందెమును, వైశ్యులకు గొఱ్ఱెయొక్క రోమములతో నిర్మింపబడిన జందెమును మనువు విధించియున్నాడు. శుభములు కోరు వారికి బంగారు జందెములను మఱికొందఱు ఋషులు విధించిరి. మొత్తము మీద జందెమును నిర్మించుటకు ౧౯ వస్తువు లున్నవి. ప్రత్తిదారపు జందెము అన్ని వర్ణములవారు ధరించదగినది. జందెము ఉత్తరీయమునకు బదులు వచ్చినను, ఉత్తరీయలోపమునుండి కాపాడుటకు ధరించితిమి గాన నుత్తరీయ మున్నపుడును జందెమును తీయగూడదు. కొందఱు ఉత్త-

రీయములు రెండు, వాటికి బదులు సూత్రములు రెండు నుండవలయు ననిరిగాని, ఉత్తరీయ మొక్కటియే యనియు, దానికిబదులు సూత్ర మొక్కటియే యనియు నిశ్చయింపబడినది. ఉత్తరీయము, జందెము — ఈ రెంటిలో నేది సవ్యముగ నున్నను మూత్రపురీషోత్సర్గాదుల నాచరింపరాదు. ఏది అపసవ్యముగ నున్నను వేదాధ్యయనము, సంధ్యావందనము మొదలగు సత్కర్మల నాచరించరాదు.

ఉత్తరీయము లేకుండ జందెముతో వైదికకర్మ నారంభించినపుడు ఉత్తరీయము మధ్యలో ప్రాప్తించినను దానిని ధరించరాదు. లౌకిక కార్యములలో తప్ప దేవ - పితృకార్యములలో నుత్తరీయమును నడుమునకు కట్టుకొనరాదు.

ఎల్లపుడు యజ్ఞోపవీతమును ధరించినవానికి బ్రహ్మ లోకము నిత్యమైయుండునని స్మృతులు ఆదేశించుచున్నవి.

## గ్రంథోపసంహారము

శ్లో॥ ఇతి బహువిధ తన్త్రాణ్యాకలయ్య ప్రభూత
శ్రమ మపరిగణయ్యాప్యాప్తయా తత్త్వసిద్ధ్యా,
అథ కథమపి యత్నా న్నిర్మితం దైవచిహ్నం
భవతు విబుధతుష్ట్యై తత్త్వసందర్శనం మే.

శ్లో॥ సన్త్యన్యే పహస్రశః ప్రతిదినం తా న్నౌమి వాగీశ్వరాన్
నోఽహంకారధియా మయా విరచితో యజ్ఞోపవీతస్య హి,
తత్త్వాఖ్యాపన తత్పరే ణ చ మయా గ్రన్థోఽయ ముద్దీయతే
తస్మా త్పణ్డితమణ్డలీ స్వహృదయం వ్యాపారయత్వత్ర హి.

శ్లో॥ ధర్మ స్సూక్ష్మ ఇతి ప్రబోధవపరై స్సర్వైరపి జ్ఞాయతే
తాదృక్సూక్ష్మ మముం ప్రకాశ పదవీం భూయాన్మనీషా మమ,
యత్న స్సిద్ధి విభూషితశ్చ మనసో మే ప్రీతి రుత్పద్యతే
సేవా వైదికపూరుషస్య రచితేత్యేవం సదా మానసే.

శ్లో॥ యద్వస్మేమవపః కుతూహల ముదేత్యస్మిజ తథా భూయసా
భూయా త్సాధుజనస్యచాపి నిఖిలస్యారంభ వేగోదయః,
యేవాయుంచ వయుంచ సాంప్రత మహో ధర్మస్య సంసేవనాత్
శ్రీయజ్ఞేశ్వర రక్షణా మధిగతా ధన్యా భవేమ క్షణాత్.

ఇట్లు

శ్రీమద్భారద్వాజస గోత్ర పవిత్ర శ్రీకృష్ణవేణీ వేంకటప్పార్య
మనీషి ప్రథమతనూజుండును, శ్రీరామకృష్ణ భగీరథ పణ్డిత
ప్రవరాన్తేవాసియు నగు శ్రీరామమూర్తి శాస్త్రిచే
సంగ్రథితమగు శ్రీయజ్ఞోపవీత తత్త్వదర్శనమున
ద్వితీయ ప్రకరణము
సమాప్తము.

ఓమ్ - తత్ - సత్.

* * *

# యజ్ఞోపవీత తత్త్వదర్శన

# గ్రంథ, గ్రంథకర్తృ ప్రశంసా

శ్లో॥ యజ్ఞోపవీత తత్త్వస్య
దర్శనం పరమాదరాత్,
అమూలచూడ మాలోక్య
పరం హర్ష ముపాగమమ్. 1

శ్లో॥ గ్రన్థకర్తు శ్చరిమం దృష్ట్వా
బహు గ్రన్థావలోకనే,
తత్తన్మత సమాధానే
గుణదోష నిరూపణే. 2

శ్లో॥ నాల్పీయః కార్య మేతేన
కృతం చేతి నివేదనే,
న మే సంకోచలేశోఽస్తి
గ్రన్థోఽయ ముపకారకః. 3

శ్లో॥ గ్రన్థకర్తుశ్చ చరితం
మయా జ్ఞాతం చిరాదపి,
భారద్వాజకులామ్భోధి
రాకాపూర్ణసుధాకరః. 4

శ్లో॥ అవ్వారి గృహనామాఢ్యః
శ్రీమాన్ పార్థివ లిఙ్గకః,
వైదికాచార నిరతః
దేవబ్రాహ్మణ పూజకః. 5

శ్లో॥ పితామహో గ్రన్థకర్తు
ర్నితాన్తామలవర్తనః,
తత్పుత్త్రో వేఙ్కటప్పార్యః
విద్వాన్ స్మార్తక్రియారతః. 6

శ్లో॥ పితా చాస్య సదాచార
నిరత శ్శాన్తదర్శనః,
ఏతస్య పుత్రా శ్చత్వారో
బభూవుః పరమోత్తమాః. 7

శ్లో॥ తేషా మగ్రభవో విద్వాన్
శివపూజాధురంధరః,
శ్రీరామమూర్తిశాస్త్రీతి
విఖ్యాతః పణ్డిత శ్శుచిః. 8

శ్లో॥ గురుభక్తః పవిత్రశ్చ
ధర్మజిజ్ఞాసు రాదరాత్,
పుత్రా శ్చాస్య విరాజన్తే
త్రయ స్సౌమ్యగుణాన్వితాః. 9

శ్లో॥ ప్రథమశ్చ శివానన్ద
స్తతః పార్థివశఙ్కరః,
దత్తాత్రేయ స్తృతీయశ్చ
విద్వద్భక్తా శ్చిరాయుషః. 10

శ్లో॥ శ్వశురో గ్రన్థకర్తుశ్చ
శౌనకాన్వయ భూషణమ్,
రామావధానీతి శ్రుతః
శ్రౌతే స్మార్తే చ కోవిదః. 11

శ్లో॥ ధర్మజ్ఞో ధర్మవిరతః
యస్యాశీః ఫల మేవ హి,
గ్రన్థ స్యాస్య సముత్థాన
మభవ ల్లోకరక్షకమ్. 12

ఇట్లు
ఆయుర్వేదాచార్య
విష్ణుభట్ల రామకృష్ణశాస్త్రి, ఏ.వి.ఏ.పి.
ఉపాధ్యాయులు
శ్రీవేఙ్కటేశ్వరాయుర్వేదకళాశాల
విజయవాడ
2-10-1952.

T.T.D. Religious Publications Series No.583
Price Rs.10/-

★ 'యజ్ఞోపవీత' మంటే?

★ భారతీయ సంస్కృతికి యజ్ఞోపవీతానికి గల సంబంధం.

★ యజ్ఞోపవీత స్వరూపానికి సూర్యుని ప్రతి దినగతికి ఉన్న సంబంధం.

★ యజ్ఞోపవీతం యొక్క ఆధ్యాత్మికమైన అంతరార్థం.

★ హైందవులందరు ఎందుకు యజ్ఞోపవీతాన్ని (పవిత్ర - ఉత్తరీయాన్ని) ధరించాలి?

ఇత్యాది విశేషాలకు వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాది - ఆధారలతో, సరళమైన భాషలో సమాధానాలను అందిస్తూ ఉన్న అపూర్వ గ్రంథమిది!

ఆర్షధర్మ పరిశీలనంలో ఆసక్తిగల ప్రతివ్యక్తి పఠింపదగిన విశిష్ట రచన!

Published by Sri A.P.V.N. Sarma, I.A.S., Executive Officer, T.T.Devasthanams and Printed TTD Press, Tirupati